"సాహిత్యలత"
9 వ కుసుమము.

# "మంచివాళ్లెవరు"

గ్రంథకర్త:
కొల్లపాలెం కృష్ణరావు.

2

# సాహిత్యలత.

## —♦ రాజపోషకులు ♦—

మ. రా. రా. శ్రీ. "దేశోద్ధారక"
కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు.

" " శ్రీకాకుళం పట్టాభిరాములు గుప్తగారు.

" " "ఆంధ్రనాటక కళోద్ధారక"
వనారస గోవిందరావుగారు.

" " జాగర్లమూడి కుప్పుస్వామి చౌదరిగారు.

3

# "సాహిత్య లత"

—♦ పోషకులు ♦—

మ. రా. రా. శ్రీ. బూదరాజు వెంకటసుబ్బయ్యగారు స్వర్గ

,, పులిపాటి కుమారస్వామిగారు,
బ్యాంకరు, గుంటూరు.

,, పి. సూర్యనారాయణగారు బి ఏ., చీరాల.

,, పేటేటి వెంకటాద్రిగారు, చీరాల.

,, తడవర్తి శీతారాంశ్రేష్టిగారు,
రాజమండ్రి నేషనల్ బ్యాంకు లిమిటెడ్,

,, ఊటుకూరి లక్ష్మీనృశింహదాసుగారు
వేటపాలెం.

,, నారపరాజు రామమూర్తిపంతులుగారు,
ఇంకొల్లు.

,, వై. వి. కృష్ణయ్యగారు చీరాల.

,, సయ్యదు దాదాసాహేబు బహదూర్,
దగ్గుపాడు,

,, శృంగవరపు అంజయ్యగారు,
కంటాక్టరు, పరుచూరు.

,, పాటిబండ్ల శ్రీమన్నారాయణచౌదరిగారు,
ప్రెసిడెంటు పంచాయతీ బోర్డు భీమవరము

,, ఊటుకూరి జయరామదాసుగారు వేటపాలెం

4

## — ఈ గ్రంథమున పద్యాలకు తప్పొప్పులు —

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 13 | 9 | పలుకువారును లేరు- | పలుకువారు లేరు. |
| 44 | 4 | ఒక్క జాని- | ఒక్క జాతిని |
| 80 | 11 | సొంప సుమము ః- | సొంపగుసుమములు |
| 84 | 2 | అల్లరి జేసి- | అల్లరిని జేసి. |
| 84 | 2 | తన్నెత- | తన్నెంత. |

## రాబోవు గ్రంథము.

# "ప్రణయ వాహిని"

## మధురమగు పద్య కావ్యము

## ఈ నాటకములోని ముఖ్యులు

| పురుషులు | స్త్రీలు |
|---|---|
| శ్రీరాములు | కనకవల్లి |
| హనుమయ్య | శ్రీదేవి |
| సుబ్బారాయుడు | చిన్నమ్మ |
| మస్తాన్ సాహేబు | సుశీల |
| పోలింగు ఆఫీసరు | కమలాక్షి |
| ఓటర్లు | కళ్యాణి |
| నాయుడు | |
| శర్మ | |

## కావలెను

నరసాపురం ప్రాంతములకు, శ్రీయుతులు కె. నరసింహంగారిని మా యేజంటుగా నియమించుకొన్నాము- అన్ని చోట్లను మాకు యేజంట్లుకావలెను. మంచి కమీషను యివ్వబడును.

మిత్రుడు కృష్ణానందునికి—

కృష్ణరావు.

# సాహిత్యలత



## సంపాదకీయము.

చదువుకొన్న పేదవారికివి కష్టపు దినములు- అందును విద్యాధికులకు మిక్కుటము- శ్రీమంతులకు సైతము సంకటములుండును గాని, వాటిదారివేరు- ఈపరిస్థితులలో, కలవారిదృష్టిపథమొకతీరు- లేనివారి ఆలోచనలొకరకము- ఉభయులకు పొత్తుగలిసిన చక్కగానుండును, గాని, ఆయవకాశములభించునను ధైర్యములేదు- దేశమునందలి ఆందోళనకిది యొకకారణము గావచ్చును.

కాగా,

"ఎవరికి వారే, యమునాతీరే" అగుచున్నది. ఈవిచిత్రపరిభ్రమణములో, కళలు నలిగిపోవుచున్నవి. రాను, రాను, గత్యంతరములేక, కళలను, వ్యాపారమునకు ఉపయో

గపరుచుకొనవలసి వచ్చుచున్నది. వర్తకమునకు కళలు సామగ్రియైనప్పుడు, అందుగల పవిత్రత పాడై, సత్యము నశించుచున్నది. ఇదిగమనించి పద్దుబాటుచేయగల మహానుభావులు కనుపించుటలేదు- ముందుకు వచ్చిన పెద్దవారు సైతము స్వార్థపరులై అవకాశములను దుర్వినియోగ పరుచుచున్నారు.

అంతశ్రమపడి సంపాదించిన విశ్వవిద్యాలయము ఆంధ్రులకింతవరకెందును ఉపయోగపడి యుండలేదు. మును ముందు రామలింగారెడ్డిగారి పెత్తనమున బాగుపడగలదని నమ్మకము.

కేవలము కళాదృష్టితో సాగించదలచిన "సాహిత్య లత" వంటి సంస్థలకిది కష్టకాలము గాకపోదు- కీ. శే. ఊటుకూరి వెంకటసుబ్బరాయ శాస్త్రిగారు సాహిత్యలతకు భూరి విరాళముకు దయచేయుంచుటకు వాగ్దత్తము చేసియుండిరి- దురదృష్టవశమున వారు అకాల మరణమును జెందుటచే, వారి కుటుంబమువారు ఆ వాగ్దత్తము చెల్లింతురని నమ్మకొంటిమి- అట్టిది జరిగియుండలేదు- వాగ్దత్తముగానున్న శాస్త్రిగారి ఆజ్ఞను, వారి కుటుంబమువారు విధిగా, త్వరలో ఆచరింతురుగాక!

ఈ "మంచివాళ్లెవరు?" వాడుక భాషలో వ్రాయబడిన సాంఘిక నాటకము- జనసామాన్యమున కర్థమగుచు, రంగస్థలమున కనుకూలమగునట్లు, రచియింపబడిన కావ్యములు నేడత్యవసరము. నిత్యము కనులయెదుట జరుగుచుండు దృశ్యములే కావ్యరూపమునుదాల్చినవి- జాతీయతను స్థిరపరిచి సంఘమును బాగుజేయుగల కథాశరీరమిప్పుడవసరము-

మంచిపూలను సేకరించగల నేర్పు- అందమగు మాలనల్లగల కూర్పుగల సమర్థుల నిర్మాణములు, యే రూపమున నున్నను రాణించగలవుగదా? విశాల దృష్టిగల విద్యాధికులిది గ్రహింపగలరు- మాప్రయత్నము సఫలమగునేని ధన్యులము

సాహిత్యలత
కార్యాలయము

కృష్ణరావు,
సంపాదకుడు,

# మొదటి అంకము.

## మొదటి తెర.

(హనుమయ్య యేకాంతముగా కుర్చీలో కూర్చొనివుంటాడు. క్రాపింగుతల- అందమైన దుస్తులు- వయస్సు 25 సంవత్సరాలు.)

హను:— ఎందుకు యీ బియ్యేలు?...సంతోషంలేని చదువులు- మొదటినుంచి మా ఫాదరు వద్దంటూనేయున్నాడు. అప్పుడు ఆమాటలు తలకు యెక్కితేనా?...... స్టూడెంటు లైఫ్ ఆనందంగానే వెళ్ళిపోయింది. ఈ బొక్కులకనీ, ఆబొక్కులకనీ, చెప్పో, చెప్పకుండానో, ఫాదరునేడిపించి డబ్బుగుంజి, యిష్టమొచ్చినట్లు ఖర్చుపెట్టుకునేవాణ్ణి. ఇప్పుడా మొత్తమంతా లెఖ్ఖచూచుకొంటే గుండె పగులుతుంది. "ఇన్నివేలు నీచదువుకయినైయి. యెర్రిని యేగాని సంపాయించలేవు"అని మా అమ్మ, అయ్య చెప్పనిరోజు లేదు......నిజమే

...వాళ్ళున్నారని యేడిస్తే లాభమేముంది? నేనెందుకు పనికిరాని వాడి నయినానని నాలోనాకే సిగ్గుగావుంది. ఉద్యోగానికి ట్రైచేదామా అంటే, రథాన రథికులంతా. యిచ్చేవాళ్ళులేక, నిరుద్యోగులై తిరుగుచున్నారు. ఏ డిపార్టుమెంటులో చూచినా, చీమదూరుటకుగూడా సందులేదు. పోనీ,- యేలాగో శ్రమపడి యేపుణ్యాత్ముడికైనా ఆశ్రియించుదామా అంటే, నన్ను చూడగానే, “నీకేం? రోగమా? ధనవంతుడవు వ్యాపారము జేసుకోరాదూ? అనిఅంటారు........ వ్యాపారానికి నేనసలే పనికిరాను. ఈ షాంపోకులు- యీ నవనాగరికతవు వేషాలు- ఈ టెన్నిసు ఆటలు- వీటితోటి వ్యాపారమేమి సాగుతుంది? ఇవన్ని వదిలెయ్యగలనా? అలా యెక్కష్టం అయిపోయాను.

...పోనీ, కుమువా? కట్నా, యింతవుంటెగదా, తొంభైతొమ్మిదోనాటి సంగతి చూచుకోవచ్చును. అనిఅనుకొని నిర్విచారంగా, అనుభవిద్దామాఅంటే వీడిమంపతెగ, మాఫాదర్ దమ్మిడీ అయినా చేతికి అందనీయడు...మర్డర్ చేతామా అనిపిస్తుంది. యెట్ క్రైమ్ను

......స్టాండర్డు ఆఫ్ లైఫ్ పెరిగిపోయింది. ఖర్చు తగ్గిద్దామా అంటే వీలుకనుపడదు. పైగా, యీచందాలతో ప్రాణం విసిగిపోతున్నది. అబ్బబ్బ! ఎన్ని చందాలు? పీర్లపండుగ మామూళ్ళని- క్రిస్టమస్ మామూళ్ళని- చంపుకతింటున్నారు. పుట్టినమట్టుకు అప్పజేశాను. ఇక యిచ్చేవాళ్ళుగూడాలేరు. ఫ్రెండ్సు అంతా, హ్యాండులోను తీసుకొని యెగగొట్టేవాళ్ళేగాని, ఒక్కరైనా కావలెనంటే ఒక్కరూపాయి యివ్వరు...... (ఆలోచించి) ఛీ- ఛీ- ... యాం గ్జయిటీ యెక్కువై తల పగిలిపోతున్నది. (అని లేచి రెండడుగులు నడిచేవరకు సుబ్బారాయుడు యెదురు పడును.)

సుబ్బా:— అప్పుడే ప్రయాణమయ్యావూ, వాంకెకర్రి తీసుకొని? అదిగాదురా! నీకు యెన్నిపర్యాయములు చెప్పేది, యింట్లోవుండమని?- ఆఁ...

హను:— డోంటాక్! ఏమిటీ నస అస్తమానం? యింట్లో నీకెదురుగా కూర్చోమంటావా?

మంచివాళ్ళెవరు?

సుబ్బా:—...ఆఁ...అయితే దేశంమీద తిరుగుతానంటా?
పనిపాటలు లేకుండా, పొలంబోయి రాగూడదూ?

హను:— నీవున్నావుగా యింట్లోఅందరిబదులు? డ్యాం పొలం!

సుబ్బా:— నాకు తెలవదని చెప్పలా? మద్దె, మద్దె, ఆయెంగిలి
ముక్కలు యేదుస్తావేం?

(హనుమయ్య కనులెర్రజేసి కోపంగాచూస్తాడు)

సుబ్బా:— వురిమిచూస్తావేందిరా? పిచ్చిసన్యాసి! పిచ్చిసన్యాసి
సని-!- పనిజేసుకో వొద్దంటరా? ఆఁ..ఈ వొంకె
కర్రలు కూడుబెడతయా? చెప్పు!

హను:— ఈ పనులు నేనుచెయ్యను. పెద్దవ్యాపారము
చెయ్యాలి. మంచి లాభంవస్తుంది.

సుబ్బా:— పెద్దదంటే? ఎంతది?

హను:— రైస్‌ఫ్యాక్టరీ పెట్టాలనివుంది. ప్రస్తుతం అది మంచి
బిజినెస్‌గా కనపడుతున్నది.

సుబ్బా:— సరే!, సరే! బాగానేవుంది. మాయదారి చదువు
కోసం కొన్నివేలు తగలేశావుగదా? ఇక, దీంతో

తక్కిందది గొరిగించు...ఆఁ...అబ్బో! పెద్దమొత్తే?

హను:— ఏమిటి యీపిచ్చిమాటలు?...అనవసరంగా మనకు తగాదా వొద్దు- నీకు యిష్టమయితేచూడు- లేకపోతే నాభాగం నాకు పంచిపెట్టు-

సుబ్బా:— భాగం! భాగమా? గీగమా? ఏతలకుమాసిన గాడిదకొడుకు చెప్పాడురా నీకు? కట్లాటివిసేర్చుకో తొందరగా బాగుపడతావు...

హను:— వాట్! నాకు భాగం లేదంటావా?

సుబ్బా:— అదిగాదురా! నేను యెంతకష్టపడి, చెమటోడ్చి యీడబ్బు సంపాదించానో తెలుసునా? నీవ్గూడా కష్టపడి......

హను:— ఈలాలింపు మాటలు నాకు పనికిరావు. నీకునాకు కుదరదు. నాభాగంసంగతితేల్చు.

సుబ్బా:—ఇదుగో, వొద్దన్నకొద్దీ, ఆ సీరాములుకు పైక మిప్పించావ్రగదా? ఆడివద్గర యేమి వసూలౌతుంది చెప్పు!

హను:— శ్రీరాములు మంచివాడు- తప్పకయిస్తాడు. అయినా

మంచివాళ్ళెవరు?

సాయంకాలము అడుగుతానుగాని,- మరి- యీసంగతి తేల్చిచెప్పూ.

సుబ్బా:— ఏందిరా! యేరిగ్రిమొగమూ! ఇక దయచేయ్! నీఖర్మం అంతేలే, పో!

(అని సుబ్బారాయుడు పోబోవును- హనుమయ్య దారి కడ్డము నిల్చి ఆపును.)

సుబ్బా:— ఆగడం! ఆగడమైనా? అయితే పోనియ్యవంట రా? ఒరేయ్! నారాయణ!......

హను:— పటప్! న్యూసెన్సు చేస్తే పోలీసులొస్తారు.

సుబ్బా:— ఏం పోలీసులొస్తే? యేమంట; అయ్యను కొడ తావంటరా? ముండమోపిముండ......

హను:— కొట్టేనా? ఫూల్! అబద్ధమాడతావేం? బదుకు పో!,

(సుబ్బారాయుడు గబగబ నడిచి వెళ్ళును.)

హను:— ఇదిగో యిదీవిధం! పాపం! పూర్వకాలపుమనిషి- ఈపూట శ్రీరాముఁను గట్టిగా అడగాలి.

(కరి తిప్పుకొంటూ పోవును.)

## 2. వ రంగము.

(కాలేజి తరగతి స్నేహితురాండ్రితో శ్రీదేవి ప్రవేశించును.
అందరు నవనాగరికపు వేషములతోనుంటారు.
అందరిచేతులలో పుస్తకాలుంటాయి.)

సుశీల:— ఎంత సరదాగావుంది? ఈ రిజల్ట్సు తెలిసినంతవరకు నాకు పిచ్చియెత్తినట్లుందిసుమా!

కమలాక్షి:— ఆహా! ఎలాగైతేనేం ప్యాసైనాం, 'చచ్చి' చెడి.

కళ్యాణి:— కమలా! ప్యాసైనందుకు సంతోషమేగాని,... యేమిటో, పాపం! చాలామంది హార్డువర్కుచేసిన స్టూడెంట్సు ఫెయిలయినారు.

సుశీ:— ఒకరి సంగతి మనకెందుకు? హార్డువర్కు చేస్తే ప్యాసవుతారా? కావలసింది, ఇంటలిజెన్సుగాని,......

కళ్యా:— అలా అనకు- తెలివితేటలువుండి కష్టపడి చదివిన వాళ్ళే తప్పిపొయ్యారు. పాపం! పిటీ!

సుశీ:— అంతా ఛాన్సు- ఎవరి అదృష్టంవాళ్ళది. లక్కుపుండాలి మొదటిమాట......

మంచివాళ్ళెవరు?

కళ్యా:— అందరిమాటకేంగాని ... శ్రీరాములు విషయం అన్యాయమే-! ఒకటా! రెండా! మూడు సంవత్సరాల నుంచి తప్పుతున్నాడు; అద్భుతమైన తెలివితేటలు వుండికూడాను...

సుశీ:— నిజమే- మహావిచిత్రంగావుంది, అతను ఫెయిలు గావడం.- తెలుగులోను, యింగ్లీషులోను మంచి నాలడ్జివుంది అతనికి.

కమ:— చాల బీదవాడుటగూడాను.

సుశీ:— సరేగాని.- మీయిద్దరు యింటరు చదువుతారా?

శ్రీదేవి:— నామట్టుకు నేను చదువను-

సుశీ:— ఏం?

శ్రీదేవి:— సర్కమ్‌స్టెన్సెస్ బాగాలేవు.

సుశీ:— ఆమాట నేనొప్పుకోను. నీకేం? కావలసినంత డబ్బుంది, హాయిగా కంటిన్యూ చెయ్యి......

శ్రీదే:— డబ్బు క్వశ్చన్‌గాదు. పరిస్థితులు బాగాలేవు.

కమ:— నీమాట నాకర్థమగుటలేదు. వొద్దనేవాళ్ళుగూడా లేరుగా?

(అందరు రెండడుగులు నడుస్తారు)

మంచివాళ్ళెవరు?

శ్రీదే:— ఆయిసుకతిన్నె చూడు! సిల్వర్ షాంపెన్, లాగ వుంది కమలా! దానిమీద యెక్కి కూర్చొంటే హాయిగావుండదూ?

సుశీ:— బాగానే వుంటుందిగాని, సన్ సెట్ అయిందే?

శ్రీదే:— అబ్బ! అంతా మహా టయింప్రకారం వర్కు చేస్తున్నావు!

కమలా:— నిజమే! సరదాగవుంది. పోదాంరండి.

(అందరు వెళ్ళి కూర్చుంటారు.)

కమలా:— మహాప్లజంటుగావుంది సుశీ!

సుశీ:— ఆఁ- వుండదుమరి? పొయిట్రీవ్రాయి!

శ్రీదే:— నామీదమాత్రం వ్రాయకు.

కమలా:— నాకు చేతనైతే మీరిలా అంటారూ? శ్రీదేవి సాంగ్సు పాడుతుందిలే......

సుశీ:— యాస్- యాస్! చిన్నప్పుడు సంగీతం నేర్చుకొన్నదట. గోన్! ఒకటి!

మంచివాళ్ళెవరు?

శ్రీదే:— చిన్నప్పుడు నేర్చుకొన్నది యింకావుందీ? ఒక టేమిటి? చిన్నప్పుడు అన్నీ మేడ్చాను.

సుశీ.— అన్నీ అంటే? అదిగూడానా?

శ్రీదే.— ఏది?

(అందరు నవ్వుతారు - సుశీల సిగ్గుపడుతుంది)

సుశీ:— తప్పేముందిలే- ఉన్నమాటేగా? ఏదీ, ఒక్కటి పాడు!

శ్రీదే:— (కోపంతో) నాకేమి రావు-

కమ:— సుశీల మాటకేంగాని, శ్రీదేవీ! నేనుగూడా రిక్వెష్టు చేస్తున్నాను. పాడు.

శ్రీదే:— నాకు రావమ్మా!

కమ:— ఎందుకు అబద్ధాలు? మొన్నరాత్రి పాడలే?

శ్రీదే:— (ఆలోచించి) అయితే యేంపాడమంటారు?

సుశీ:— నీయిష్టమొచ్చింది పాడు.

కమ:— సావిత్రిలో సాంగ్సు చదువు.

శ్రీదే:— త్యాగయ్యగారి కృతి వినండి-

సుశీ:— మేము భక్తులము గాలేముగా?

కమ:— (కసరుచు) సుశీ! అరవకుండా, విను.

(శ్రీదేవి "సుజనజీవనా" అని కృతిపాడును.)

కమ:— ఎంత బాగున్నది? త్యాగరాజు మహానుభావుడు సుమా!

సుశీ:— ఆయన ఆంధ్రుడా? అరవవాడా?

కమ:— ఎవరైతేనేం! మంచి భక్తుడు- ఆయన మంచి గుణమే కావలసింది.

(శ్రీరాములు అదారిని వెళ్ళుచుండను. కమలాక్షి చూచి)

కమ:— అడుగో! శ్రీరాములు!

శ్రీదే:— పిలవండి!

(అందరుకలిసి చప్పట్లుగొట్టి పిలువగా, శ్రీరాములు సమీపించును.

శ్రీరా:— వాట్ సిస్టర్స్! అందరు యిక్కడ చేరారు?

కమ:— ఇప్పుడే స్కూలునుండి వెళ్ళుతూ, హాయిగావుంటే యిక్కడ కబుర్లు చెప్పుకుంటున్నాము.

మంచివాళ్ళెవరు?

శ్రీరా:— కాదే? శ్రీదేవి పాడుతున్నట్లున్నది?

శ్రీదే:— ఆఁ... ఏదో లెంకి! పాపం!మీరిజట్టు........

శ్రీరా:— ఏమి? నాకు లేని విచారం నీకెందుకు?

(శ్రీరాములుకూడా, కూర్చొనును.)

శ్రీదే:— చిత్రంగా వుందండీ! తెలివిగలవాళ్ళే ఫెయిలవుతున్నారు.

శ్రీరా:— ఔను! ఈరోజుల్లో, తెలివిగలవాళ్ళే తప్పిపోతారు

నేటిస్థానిక సంస్థల పోటియందు
పట్టి దద్దమ్మలేగెల్చు భాతిగాను,
దేశమెల్ల పరీక్షఁ దేలుచుండ్రి
సర్వసాధారణంబిది జగతియందు.

అదిగాక, ఈపరీక్ష ప్యాసైనామని సంతోషపడుటకే గాని. ప్యాసైనందువలన గలిగే లాభము, తప్పినందువల్ల వచ్చేనష్టము, రెండూ వొకటే......

శ్రీదే:— సత్యమే- ఈవిద్యావిధానము రానురాను, అంత నిరుపయోగకరమైనది.

కమ:— మరి, యిక ముందేమి చేయదలచావు?

శ్రీరా:— అదే యిప్పుడు ఆలోచనీయాంశము.

సుశీ:— ఏంజేస్తాడు? ఉద్యోగం చేస్తాడేమో?

శ్రీరా:— ఉద్యోగాలుంటేగా చేయడానికి?

శ్రీదే:— దొరికినా, అది అంత మంచిపనిగాదు. అడ్డమైన వాళ్ళకు సలాము పెట్టాలి......వ్యాపారము చేయరాదూ? స్వతంత్రజీవనము......

శ్రీరా:— ఇది మరీబాగుంది......

పలుకువారును లేరు పిలిచెడువారు లేరు
చుట్టపక్కాలుగూడను చూడబోరు
పెట్టుబడిదార్లు గలుగరు మొట్టమొదరె,
ధనములేకున్న కొరగాడు మనుజుడెందు.

సుశీ:— అంత బొత్తిగా లేనివాడవా, శ్రీరాములూ!

శ్రీదే:— పాపము! ఈస్థితిలో, కష్టమే... అయినప్పటికి గుణము మంచిదైతే డబ్బుపుట్టకపోదు.

శ్రీరా:— శ్రీదేవీ! అలా అంటున్నావేమిటి? నాయందు లోపము గనిపెట్టావా? అయినా, అందరు సత్యహరిశ్చంద్రులందురుగదా? ఏవో ఒకటి రెండు లోపాలుండవచ్చును.

మంచివాళ్ళెవరు?

శ్రీదే:— లేవు- లేవు- లేవుగనుకనే, నీకు ధనలోపముండ దన్నాను. మంచి పుష్టివున్నది. కాబట్టి వ్యాపారంలో పైకి రాగలవనికూడ నమ్మకము.

సుశీ:— శ్రీదేవి పెట్టుబడిపెట్టి బిజినెస్ చేయిస్తుందేమో లెండి. (అని నవ్వును.)

శ్రీదే:— (కోపంతో) ఎదుంకు చేయకూడదు? ఆపదలో వున్న స్నేహితుణ్ణి ఆదుకోకూడదా?

శ్రీరా:— శ్రీదేవి! ఇచ్చినా, యివ్వకపోయినా, మాటన్నా అన్నావు. థ్యాంక్స్...

సుశీ:— అమ్మగారు కాపురానికి వచ్చారా, శ్రీరాములూ!

శ్రీరా:— ఆఁ! వచ్చినట్టే, చిన్నవాణ్ణి అనుకొన్నావా? యిప్పుడు నాయేజి 21...

సుశీ:— ట్వంటీవన్? అమ్మబాబ్బో! చాలా లేతవానివలె నున్నావుసుమా!

శ్రీరా:— నా సెవెన్‌టీను యియరున, పబ్లిక్ యెగ్జామినే షనుకు కూర్చొన్నాను. అప్పటినుంచి దండయాత్రలే-

కమ:— అంటే, తప్పిపోవడమా? కాస్త, క్లియరుగా చెప్పండి.

శ్రీదే:— కమలా! చీకటిపడుచున్నది, నేటికి మన కొలువు చాలిస్తే బాగుంటుందేమో?

సుశీ:— బయలుదేరండి! పోదాం!

(అందరులేచి మెల్లగా నడుస్తారు- శ్రీదేవి శ్రీరాములుని చూస్తూ వెళ్ళుతుంది.)

### 3 వ రంగము.

(ఉదయము- శ్రీరాములు యిల్లు- శ్రీరాములు చిరుచాప మీద కూర్చొని వుంటాడు- ఇల్లు యెన్నడోగట్టిన పాతది, గాని, పరిశుభ్రముగా వుంటుంది. శ్రీరాములు మామూలు దుస్తులతో వుంటాడు.)

శ్రీరా:— ... దైవవిధియని పూరుకోగలమా?... అయినా, ఆ భగవంతుడికి నేనేమి అపకారము జేశాను?...... ఛా! దైవములేదు, దయ్యములేదు... పురుషుడు తెలివితేటలతో పయికిరావాలి, ఈవేదాంతములన్నీ చేతగాని పెద్దన్నయ్యలేర్పరుచుకొన్నవి- నాలడ్జియీజ్ పవర్,! అంతే.........అయితే శ్రీమంతులసంగతో

సు. వివాళ్ళెవరు?

...వీళ్ళందరు మొన్నరాచ్చిప్పలే ... ఇప్పుడు యీ చర్చలన్నీ అనవసరం. పురుషుడు శక్తిసామర్థ్యాలు చూపించి గొప్పవాడు కావాలి. యెవడో ఆర్జించి యిచ్చిపోతే కూర్చొని తినేవాళ్ళ జీవితం నీచమైంది- వాళ్ళందరు భరణమున కాసించిన, పూర్వసువాసినుల లెక్కలోనివాళ్ళే......

స్వీయ శక్తిం బ్రికటించి, పేరుగాంచి,
ధనము నార్జించి, భోగము లనుభవించి,
సర్వమిమడొచు సలరారు సజ్జనుండు
పురుషుడనజెల్లు- గాకున్న, పొలతిమేలు-

సరే ... వృద్ధురాలగు తల్లిని, యౌవనంలోవున్న భార్యను సుఖపెట్టవలసిన బాధ్యత నాయందున్నది... వృద్ధురాలగు జనని కోర్కెలు దీర్చుటకు యెంత ధన మవసరమో, అంతకంటె మిక్కుటంగా వడుచు పెళ్ళాన్ని సంతోషపెట్టుటకు కావాలి- ఇంత బరువు వేసుకొని. యీసంసారశకటాన్ని యెలా, లాగగలనో తోచకున్నది. ఎప్పటికప్పు డేదో అవసరము ధన ముతో కలుగుతునేయున్నది. "నీభార్యను తీసుకొని

పోవలసినదని" మొన్న మామామగారు జాబువ్రాసి నారు. ఎలా తీసుకొని వచ్చేది?... అన్నట్లు... మర చితిని... నా కార్యానికి హనుమయ్య తండ్రితో చెప్పి . వందరూపాయలు యిప్పించాను. ఆ బాకీకే గాబోలు ఈపూట వస్తానని కబురుచేశాడు. ఇప్పుడు వస్తే యేమని సమాధానం చెప్పేద?...(ఆలకించి) ఎవరబ్బా! ఆవచ్చింది? ముంగిట్లో బండియున్నది- హనుమయ్య బండియెక్కి రాడే?...

(బండిలోనుంచి శ్రీదేవిదిగివచ్చును- శ్రీరాములు నివ్వెరపోయి చూచుచుండును.)

శ్రీదే:— (సమీపించి) శ్రీరాములుగారూ! అలా చూస్తు న్నారేమిటి? నన్ను మరెవరో ననుకొన్నారా?

శ్రీరా:— (అనుమానిస్తూ) శ్రీదేవీ!... కూర్చో... తలవని తలంపుగా వచ్చావు?

శ్రీదే:— (కూర్చొనుచు) తలవని తలంపుగాదు- ఇక్కడికి రావలెనని తలపెట్టే వచ్చాను. నాతో మాట్లాడుటకు అభ్యంతరము లేదనుకొంటాను.

మంచివాళ్ళెవరు?

శ్రీరా:— అభ్యంత మేముంది? ... గాని ... "శ్రీరాములు గారూ!" అని "మీరు" అని సంబోధిస్తున్నావేమిటి? ఎన్నడూలేని అలవాటు...

శ్రీదే:— పెద్దవాళ్ళుగదా అని గౌరవంగా అలా అన్నాను.- తీరికగా కూర్చొన్నారు భోజనమైందా?

శ్రీరా:— ఆఁ...

శ్రీదే:— శ్రీరాములుగారూ! నేనుగూడా చదువు మాని వేయదలచాను.

శ్రీరా:— మానివేసి?

శ్రీదే:— మానివేసి, యేమిచెయ్యమంటారో చెప్పండి? మీ సలహానుగోరి వచ్చాను. నాచరిత్ర మీకు తెలిసినదే గదా?

శ్రీరా:— అంత బాగా తెలియదు... "కొన్ని యేండ్లక్రిందట నిన్ను యెవరో, చేరదీసినారని,... అటుపిమ్మట నీవు అతనిని విడిచిపెట్టి...స్కూలులో చేరినావని......" మొదలైన సంగతులు కొన్ని విన్నాను.

శ్రీదే:— (సిగ్గుతో తలవంచుకొని) ఔను...మరినేను...?

శ్రీరా:— .........?

శ్రీదే:— ఇకమీదట ఆవిషయాలు నా తలకెక్కవు...

శ్రీరా:— మేరేజి చేసుకోగూడదు?

శ్రీదే:— నో! నో! . .

శ్రీరా:— మరి?

శ్రీదే:— నేనొక పనిచేయ దలిచాను... ఏమిటంటే? కొంత ధనము పెట్టుబడిపెట్టి, యేదైనా బిజినెస్ చేయ నిశ్చయించుకొన్నాను. ఈ విషయములో నీసహాయము కావాలి.

శ్రీరా:— నాసహాయమా? ఏవిధంగా?

శ్రీదే:— కావలసినసొమ్ము నేను యిస్తాను. నీవు వర్కింగు పార్టనరుగా పనిచెయ్యి...

శ్రీరా:— (సందేహించును)

శ్రీదే:— అనుమానమేల?

శ్రీరా:— ఆఁ! . . . ఆడపెత్తనము కూడదంకురుగదాయని సందేహించుచుంటిని. . .

మంచివాళ్ళేవరు?

శ్రీదే:— శ్రీరాములూ! చదువుకొన్నవాడవు - అనేకవ్యవహారములు నిత్యము చూస్తూ, లోకము పోకడ గుర్తెరింగినవాడవుగదా? నీవుకూడా అనుమానిస్తావేమి? ఇంతమాత్రమున కొంపలంటుకొని పోవునా?

శ్రీరా:— సరే- కానిమ్మా! అయితే నేను పార్ట్నరుగా వుండలేను. గుమాస్తాగా యేర్పరుచుకో,- సొంత వ్యవహారమువలె చూచుకొనుచూ, అన్నిపనులు జేస్తుంటాను.

శ్రీదే:— ఈమాత్రానికి సందేహించడమెందుకు? అలాగే నీయిష్టము వచ్చినట్లు జరుపుచుండుము. రాబోవు పాడ్యమి మంచిదినమని అన్నారు. ఆనాడు ప్రారంభించుట మేలు-

శ్రీరా:— ఇంతకు యేం వ్యాపారము?

శ్రీదే:— నీవే ఆలోచించు...

శ్రీరా:— ఓహో! ఇది బాగున్నది. ఇంతవరకు సిద్ధపడివచ్చినదానవు, ఆలోచించకుండా వున్నావా? నీమనసులో యేమున్నదో చెప్పు.

శ్రీదే:— నేనేమి అనుకోలేదు.- ఇటీజ్ ఫాక్ట్! ఏదో బిజినెస్ నీవే నిర్ణయిస్తావని నానమ్మకము.

శ్రీరా:— అలా అయితే...(ఆలోచిస్తూ) ఖద్దరు బట్టల కొట్టు లాభదాయకమేనా?

శ్రీదే:— అందులో లాభం విశేషము రాదు...
అదిగాక, ఖద్దరు ఖరీదుయెక్కువ- అందరు కొనలేరు. విదేశవస్త్రాలు పెట్టగూడదూ?

శ్రీరా:— (నవ్వుతూ) హాస్యాస్పదము- ఈరోజుల్లో అందరికి "ఖద్దరు కట్టండి" అని చెప్పవలసిన, మనము ఆపని చేయవచ్చునా?

శ్రీదే:— అయితే- తలనూనెలు-సెంట్లు-సబ్బులు మున్నగునవి పెడితే?

శ్రీరా:— స్వదేశీ వస్తువులన్నీ పెట్టవచ్చు- కొన్ని, కొన్ని యేజన్సీలు తీసుకొని పనిచేయవచ్చును. మోర్ ఆర్, లెస్, ఫ్యాన్సీషాప్, అన్నమాట-

శ్రీదే:— బాగానేవుంది- సరే, అదేస్థిరము - - -

శ్రీరా:— - - ?

మంచివాళ్ళెవరు?

శ్రీ దే:— శ్రీరాములూ! మనస్నేహము మరచిపోవద్దు సుమా! (చిరునవ్వు)

శ్రీ రా:— అదేనేనూ కోరుతూవున్నాను.

శ్రీ దే:— (లేచి) ఇక వెళ్ళనిస్తావా? - - - సాయంకాలము మాయింటికి రాగూడదూ? కొంతసేపు మాట్లాడు కోవచ్చు.

శ్రీ రా:— అలాగే వస్తాను...గాని, మాట్లాడుకోవలసిన విష యాలు యిప్పుడేమున్నాయి?

శ్రీ దే:— ఐవిల్ టేక్ లీవ్ (అనికొన్ని యడుగులు వేయుచుం డును)

(శ్రీరాములు అనుమానిస్తూ, చూచి)

శ్రీదేవీ! ... శ్రీదేవీ!-

శ్రీ దే:— (వెనుకకువచ్చి) పిలిచావా?

శ్రీ రా:— ఆ!...

శ్రీ దే:— (సమీపించి) చెప్పు! ... అనుమానిస్తావేం?

శ్రీ రా:— నేను ... నాభార్య పుట్టింట్లోవుంది...

శ్రీదే:— ఆఁ! ఏంటే?

శ్రీరా:— ఏమీలేదు... తీసుకొనిరావాలి...

శ్రీదే:— ఏమిటది శ్రీరాములూ! చెప్పదలచినది చెప్పరాదూ?

శ్రీరా:— నేను పరిస్తుతం, యింప్లీ ఫ్యాందుస్తో వున్నాను.

శ్రీదే:— డబ్బుకావలెనంటావా? ఆమాట కింత భయపడతా వేం? ఎంతగావాలి?

శ్రీరా:— ఎంతో నా? పదిరూపాయలు- టెన్ రుపీస్-

శ్రీదే:— సరే, పంపిస్తాను - - (నవ్వుతూ) భార్యను విడిచి వుండలేకుండావున్నావా?

శ్రీరా:— (నవ్వును)

శ్రీదే:— (నవ్వుస్తూ) ఆలాగే పంపుతాలే-

(శ్రీదేవి నడిచి వెళ్లును)

శ్రీరా:—

కాలగమనము చక్రింబు లీలనుండు,
ఆ, విచిత్రి పరిభ్రిమణాంతరమున,
గలుగు మార్పుల నంతము - తెలియబడవు.
యెవరికేగతిపట్టునో? యేమియగునో?

(శ్రీరాములు లోనికేగును.)

# రెండవ అంకము.

## 1. వ రంగము.

(మస్తాన్‌సాహేబు, హనుమయ్య కూర్చొని వుంటారు- మస్తాన్ లుంగీ కట్టుకొని, మాసిన జుబ్బా తొడుక్కొని వుంటాడు- హనుమయ్య తెల్లని శుభ్రమైన దుస్తులు ధరించి, కళ్ళ జోడు పెట్టుకొని కాళ్ళజోడుతో, నవనాగరికునివలె నుంటాడు- పిరికిగుండెకలవాడు.)

మస్తా:— భాయ్! మాకీ యింతషుళభంగా హవుతదని తల్సిందిలేదు.

హను:— అవును- నేనూ అలాగే అనుకొన్నాను- గాని, మొన్న నీవు పోయి బెదరించగానే కాళ్ళబేరానికి వచ్చాడు. అసలు మాజాతి పిరికిదిగాదూ?

మస్తాన్:— సత్తెం! సత్తెం! హింకో ఖులంవాడ్తైతే, దేత్తైనె!

హను:— నిన్ను ప్రయోగింపక పూర్వమే కొంత మెత్తబడ్డాడు. దేనికైనా మంచిదని నిన్నుకూడా, పోయి రమ్మన్నాను.

మస్తా:— హారే! మాని యెంత గడబిడ్ చేశాం, మాలుం?
హల్లాతోడు- గడ్‌గడా హడలయిపొయ్యాడు, భాయ్
మాది లేకపోతే, అసల్, సమాధానంచేస్తాడు మీకీ?

హను:— ఔనులే! ఏదో, అరిచావట...

మస్తా:— అరిచాం, అరిచాం? భలేఅరిచాం వోయ్!...
అసల్ క్యా, క్యా, దియా,? భాయ్!

హను:— ఏమన్నదీ? నాకు న్యాయంగా రావలసింది,
యిచ్చాడు.

మస్తా:— న్యాయం, వుండావులే...క్యాదియ్యా?

హను:— స్థిరచరాస్తులు చెరిసఖముగా పంచుకొన్నాము.

మస్తా:— అచ్ఛా! మాకీ మేర్భానీ...?

హను:— ఔనౌను- అందుకే పిలిచాను. మస్తాన్! ఇదిగో!
మన స్నేహం, చిన్నప్పటినుంచీ వుంది... ఈనాటి
వాళ్ళము కాదుగదూ? ఎప్పుడూ మనకిద్దరికీ...

మస్తా:— హారే! మాటసేస్తావ్! యేసాబ్ కైకూరే?

హను:— లేదు, లేదు. ఇదుగో! ఇప్పుడు యీ యిరువై
రూపాయలు తీసుకో...మళ్ళీ...

మంచివాళ్ళెవరు?

మస్తా:— (కోపంతో) క్యా? క్యా! మాది హాంతకష్టంపడేతో భంచేత్! బీస్‌రూపాయి దేతే?

హాను:— కాదు- ఇప్పుడుమాత్రం యిదితీసుకో...తర్వాత మళ్ళీ...

మస్తా:— తర్వాత?...నకోలేజె...ఛోకలీకె, నకో, జావ్!

హాను:— అంత కోపమెందుకు మస్తాన్! సరే! ఇంకో అయిదు రూపాలు తీసుకో- ఇంద!...

(మస్తాన్ అక్కరలేనట్లు నటిస్తూ, తీసుకొనును.)

హాను:— మన యిద్దరికి స్నేహం వుండాలిగాని, డబ్బుప్రధానంగాదు మస్తాన్!

మస్తా:— అచ్ఛా! మాది పాణం యిస్తాం, భాయ్!

హాను:— ఔనౌను.- కొద్దిరోజుల్లో మన మునిసిపల్ ఎన్నికలు జరుగబోవుచున్నవి. ఆ ఎన్నికలలో నేనుగూడా పాల్గొన దలిచాను. అప్పుడు మళ్ళీ నీసహాయంకావాలి తెలుసునా?

మస్తా:— ఓ... మాకి వచ్చి నిలబడేతో, ఎన్నికల్ గిన్నికల్ ఎగిరిపోవాల. దేఖో!

హను:— (నవ్వుతూ) యెన్నికలు యెగిరిపోకూడదు, మనము గెలువాలి.

మస్తా:— గెలుస్తాం భాయ్! మాది యెక్కడా పోయినా, జయం వుండాయ్!

హను:— సరే- ఇక నీవు వెళ్ళు-

(మస్తాన్ వెళ్ళిపోవును- కొంతసేపాగి, హనుమయ్య బయలు దేరగానే, శ్రీరాములు యెదురుపడును.)

హను:— అహో! శ్రీరాములూ! కనుపడుట లేదేమి? ఆర్ యునాట్ యిన్ టవున్?

శ్రీరా:— లేను- పుట్టింట్లోవున్న నా వైఫ్‌ను తీసుకొనివచ్చుటకు వెళ్ళాను.

హను:— అలాగా? అహాఁ! మా చరిత్రి విన్నావా?

శ్రీరా:— లేదే - ? - ఏచరిత్ర?

హను:— నేనూ, నా ఫాదరు డివైడ్ అయ్యాము-

శ్రీరా:— ఎప్పుడూ?

హను:— మొన్ననే— యు, సి! ఈ పెద్దముండాకొడుకులకు మనకు పొత్తుకలువదోయ్! మన వ్యూస్ ఒకరకంగా వుంటయి...

మంచివాళ్ళెవరు?

శ్రీరా:— నిజమేగాని, అంత తొందరపడ్డావేం?

హను:— ఏదో, అయిపోయిందిలే!... ఇదుగో, నీబాకీ నావంతుకు వచ్చింది- నీవు వ్రాసియిచ్చిన నోటు కూడా, నాదగ్గరేవుంది- తెలిసిందా? ఇప్పటికే చాల కాలమయింది- యిచ్చేద్దూ?

శ్రీరా:— సాధ్యమైనంత త్వరలో సర్దుతాను.

హను:— ఇదుగో! శ్రీరాములూ! సరేగాని,- ఇలా రా! వుయి వల్ సిట్ యెవైల్,- నీతో మాట్లాడాలి.

(ఇద్దరు అక్కడకూర్చొందురు)

హను:— శ్రీరాములూ! నిజంచెప్పు- ఇట్ సీమున్, శ్రీదేవి, యీజ్ కమింగు వెరి ఆఫెన్, టుయు,— వాటీజ్ ది మేటర్?

శ్రీరా:— ఏమిటీప్రశ్న? పనివుంటే, రాకూడదూ? వాట్ వండర్ యీజ్ దేర్?

హను:— ఆపనిసంగతే, నేను అడిగేదిగూడా- వేశ్యతో నీకేమి పనా, అని?

శ్రీరా:— మైడియర్ ఫ్రెండ్! వేశ్య అంటే అంతచులకనగా

మాట్లాడుతావేం? వాళ్ళల్లో మంచివాళ్ళుండ గూడదూ?

హాను:— (వికటముగా నవ్వుతూ) ఓహో! నీకప్పుడే తల కెక్కిందే విషం? ఎలాగూ!

శ్రీరా:— (కోపంతో) వాట్, నాన్సెన్సు, యుటాక్!

హాను:— అయితే, శ్రీదేవి పరువు మర్యాదలు కలదంటావా, యేమిటి?

శ్రీరా:— అక్షరాలా...

హాను:— (పెదవి విరుస్తూ) పాపం! పిచ్చవాడవు- నీకు తెలియదు...

శ్రీరా:— నీకు మహా తెలిసినట్టు?

హాను:— చూపించేదా? నిజానిజాలు-

శ్రీరా:— చూపించావులే, పో! అనవసరంగా ఆమె జోలికి పోతే, చీవాట్లు తింటావు...

హాను:— వెయిట్! వెయిట్! నీకే, అర్థమౌతుందిలే కొన్నాళ్ళకు...

శ్రీరా:— ఆల్ రైట్!

మంచివాళ్ళెవరు?

హను:— సరే- పో!

(శ్రీరాములు లేచి వెళ్ళబోవును.)

హను:— ఇదుగో! నాకు, సొమ్ము అవసరంగావుంది- నీ బాకీ రేపు క్లియర్ చెయ్యాలి...

శ్రీరా:— (నిరసంగా) ఐవిల్ ట్రై- (అని వెళ్ళిపోవును)

హను:— (లేచిపోవుచు) ఎంత అహంకారము! ఇతనికి చక్కని, లెసన్ నేర్పాలి- డ్యాన్సింగు గరల్ అంటే యేమిటో, యితనికి అర్థంకావాలి- అయివిల్ సి, మై బెస్ట్- (వెళ్ళిపోవును.)



## 2. వ రంగము.



(శ్రీరాములు యిల్లు- చిరుచాపపై భార్యాభర్తలు కూర్చొని యుందురు- కనకవల్లి విద్యాబుద్ధులు గలది- పతిభక్తియే ముఖ్యమని యెంచుచుండును. సామాన్యపు దుస్తులను ధరించి, కొద్దిపాటి నగలతో నుండును.)

శ్రీరా:—

అమిత కృషి జేసి, ఫలమున కాశపడగ
కష్టమెల్లను మాయమై, నష్టమొదవు-
ఇదియె యీనాటి ధర్మమా? యెట్టులింక
శాంతముగ జీవితంబులు సాగగలవు?

దరిద్రం మహావిచిత్రంగా వస్తుంది. మానవులకీబాధ ధరింపరానిదిసుమా!

కన:— నిజమేగాని,

వసుధ దారిద్ర్యదేవత వాగవ౯త-
అర్థి, దుర్బలహృదయుల నణచివేయు,
తెలివిగల ధీరచిత్తులు దీనిగూడి,
అంచితానందసౌఖ్యము లందగలరు-

మంచివాళ్ళెవరు?

శ్రీరా:— ఏమో-? ఈ వేదాంతములకేమిగాని, పడుచుతనములో యీ లేమిడికన్న నరకమేమేలు-

పండుగనాడైన పదిమందితోపాటు
హాయిగా భుజియింపననువుపడదు

పాటివారలలోన, చక్కగా మనసైన
వలువలు ధరియింప వలనుపడదు

ఈడువారలగూడి యే చిత్రశాలనో
అరుగుట కవకాశ మమరబోదు

అనురాగరూపమౌ, అర్ధాంగలక్ష్మికి
పూలైనగొని పెట్ట వీలులేదు,

హేయముగనెట్లోపడియుండి, యోడి, యెండి
బ్రతుకవలయును జీవచ్ఛవంబువోలె-
పడుచుదనమున దారిద్ర్యబాధకన్న
మరణమే వెయ్యిరెట్టుల వరకుమేలు.

(శ్రీదేవి ప్రవేశించును- శ్రీరాములు సగౌరవంగా కూర్చోబెట్టును.)

శ్రీదే:— శ్రీరాములూ! భార్యాభర్త లేకాంతముగా నున్నప్పుడితరులు, రాగూడదని పెద్దలవాక్యము- నేను

మీ ఆనందమునకు అంతరాయము కలుగజేశానా?

(కనకవల్లి నవ్వుచూ తలవంచుకొనును.)

శ్రీరా:— శ్రీదేవీ! నీవు సోదరివని తలచుకొంటిని- కాబట్టి యేమీ అనుకోను.

(శ్రీదేవి తెల్లబోయిన మొఖముతో ఆశ్చర్యముగా జూచును)

శ్రీరా:— అలాచూస్తున్నావేం? నేనసత్యమాడితి ననుకొన్నావా?

శ్రీదే:— (తెప్పరిల్లి) అబ్బే! ఏమీలేదు- సరేగాని, వ్యాపారమెలా నడుస్తున్నది?

శ్రీరా:— అప్పుడే? ఈవారంలోనేగా, కొట్టుబెట్టినది? ఇంకా ఆర్డరుయిచ్చిన సరుకు కొంతరాలేదు- నీవుగూడా షాపుదగ్గరికి వస్తుండరాదూ?

శ్రీదే:— అంతా నీకే వదలిపెట్టాను. నా బాగోగులు నీవి కావా? వాట్, డుయూసే?

శ్రీరా:— ఔసాను. (నవ్వుచు) శ్రీదేవీ! మనమిద్దరము ఇంగ్లీషులో మాట్లాడుతుంటే, కనకవల్లి యేమను కొంటుందో? కాబట్టి, తెలుగులోనే మాట్లాడు-

మంచివాళ్ళెవరు?

కనక:— ఓహో! నేనేమనుకొంటాను, మీరు మాటాడు కొంటే? శ్రీదేవి ఆడదిగాదా? నీవుమగవాడవుగాదా? (నవ్వును)

శ్రీదే:— ఔను- తప్పేమున్నది?... కనకవల్లీ! మనయిద్దరకు యిష్టమైనప్పుడు, యీయన పెత్తనమేమిటి?

శ్రీరా:— స్త్రీసామ్రాజ్యము యిప్పుడే ప్రారంభమవుతుందా యేం?

కనక:— ఆహాఁ! కాదు ... ఎప్పుడు మీరే మామీద సవారీ చేస్తుందురుగాని,...?

శ్రీరా:— అయితే, యికనేను మాట్లాడను.

శ్రీదే:— ఇదో బెదిరింపు...? కాసేపు పూరుకొంటే మీరే మాట్లాడతారు.

శ్రీరా:— నిజమేలే-! మాలో ఆలోపముండబట్టే, మీరలా అనగలిగారు.

కనక:— ఎలాఅయినా అంటారు, మీకేం? మాటలు రాక పోతేగా?

శ్రీరా:— సరేగాని, శ్రీదేవీ! నేను మీయింటికే బయలు

దేవుడా మనుకొంటున్నాను- వ్యాపారపుసంగతులు మాట్లాడాలి...

శ్రీ దే:— ఎవరు రావద్దన్నారు? అయినా, మీవంటివారు మాయింటికి వస్తారా?

శ్రీ రా:— రాకయేంగాని,...? ఇప్పుడే, భోజనముచేసి వస్తాను... మరియొక విషయము...హనుమయ్యకూ నాకూ, నిన్న కొంత సంభాషణజరిగినది. అతను నోటికివచ్చినట్లు మాట్లాడగా,...

శ్రీ దే:— ఏవిషయంలో?

శ్రీ దే:— డిటెయిల్సు తర్వాత చెపుతాను. అందుమీదట' అతను బాకీయివ్వవలసినదని తొందరజేశాడు?

శ్రీ దే:— మీ రెప్పుడు యిస్తామన్నారు?

శ్రీ రా:— నేను సమాధానం చెప్పకముందే, అతను "రేపు యిచ్చితీరవలె" అన్నాడు.

శ్రీ దే:— ఏమాత్రము యివ్వాలి?

శ్రీ రా:— ఎంతోనా,? ఒక వందరూపాయిలు

శ్రీ దే:— ఈ చిల్లర బాకీ వుంచగూడదు- తప్పకుండా, వెంటనే అందరికి యిచ్చేవేయండి- ఇంకా బాకీలువున్నయా?

మంచివాళ్ళెవరు?

శ్రీరా:— ఇంకేమిలేవు, యిది వొకటే- గాని, యిప్పుడు నేనెక్కడ తెచ్చియిచ్చేది?

శ్రీదే:— నేను యిస్తానులెంకి.

శ్రీరా:— సోదరీ! ఇన్నివిధాల సహాయము జేస్తున్నావు- నీఋణము యెలా తీర్చుకోగలము?

శ్రీదే:— ఆమాట లనవసరము- త్వరలో నీకు మంచిరోజులు వస్తాయి.

కనక:— నీనోటివాక్యము సఫలమగుగాక!

శ్రీదే:— సరే- ఇక నేను వెళ్ళుతున్నాను. నీవు మాయింటికి వస్తావుగదా?

శ్రీరా:— ఆఁ! తప్పకుండా...

(శ్రీదేవి లేచి వెళ్ళును)

శ్రీరా:— కనకం!... (తలవంచును)

కనక:— (ఆశ్చర్యముతో) ఏమది? దీనముగనున్నారు?

శ్రీరా:— ఏమియులేదు- మాతాతతండ్రు లెంతగౌరవముగా జీవించారో, అంత నీచముగ్గా నేనుండవలసి వచ్చింది. ఔరా! ఒక్క స్త్రీయా? అందులోను వేశ్య... నాకీ లోకమున దిక్కైనది?... కాలవైపరీత్యము!...

ఆంధ్రుల కెట్టిగతిపట్టినది?...

చెండాడిరొకనాడు చీల్చివైరులగుండె
తెలుగువారలశక్తి తేటపడగ;
పాలించిరొకనాడు ప్రభువులశాసించి
తెలుగువారలప్రజ్ఞ దెలియులాగు;
కట్టించిరొకనాడు కవితను పందిళ్ళు
తెలుగువారలకీర్తి దిశలునిండ,
అర్పించిరొకనాడు అడిగినదెల్లను
తెలుగువారల దానకలనజాట,

విభవముల బొందిరొకనాడువిజయులగుచు
అంతఖ్యాతినిగన్నట్టి ఆంధ్రసుతులు
అక్కటా! నేటికీగతి దిక్కులేక,
కొలగతిజిక్కి, కష్టాలపాలబడిరి—

... శ్రీదేవి... ఆఁ-! చాలామంచిది- చదుకొన్న వారిలోగూడా, యిలాంటివారు ఒకరిద్దరే వుంటారు-

కనక:— ఔనాను- చదువుకొన్నవారిలో చాలాభాగం, దుర్మార్గమున్నదని మీరే చెప్పారు ... అదిగాక ఆపత్కాలంలో భగవంతు డిలాంటివారిని చూపిస్తుం

మంచివాళ్ళెవరు?

టాడు... శ్రీదేవి అమాయకురాలు, ఆమెను సం
తోషపెట్టుట మనవిధి...

నాయనమ్మల కథలను నమ్మువారు,
దేవుడెవ్వడోగలడని తెలుపుచుండ్రి-
దేవుడెవ్వడు— ప్రేమతో, దిక్కులేని
కష్టజీవులబ్రోచెడు ఘనుడుగాక,!

శ్రీరా:— చక్కగా చెప్పావు, కనకం!
కనక:— ఇక భోజనానికి లేవగూడదూ?
శ్రీరా:— సరే- పద...

(తెర వాలును.)



## 3. వ రంగము.



(శ్రీదేవి శయనమందిరము- బాగుగా అలంకరించి వుంటుంది- అగరువత్తులు వెలుగుతుంటయి- శ్రీదేవి, శ్రీరాములు చేరియొక సోఫామీాద కూర్చొని మాట్లాడుకొం టుంటారు- ఎదురుగా బల్లమీాద ఫలహారములు సుందరమైనముక్కాలిపీటమీాద అత్తరుసీసాలు వుంటయి- శ్రీదేవి చక్కగా ముస్తాబు అయివుంటుంది)

శ్రీరా:— .........?

శ్రీదే:— తర్వాత?

శ్రీరా:— హనుమయ్యను మందలించాను- అతడికి నామీాద కోపమువచ్చి, తనబాకీ యివ్వమని గట్టిగా అడిగాడు.

శ్రీదే:— ఈధన మదాంధులు యింతకన్న యేంజేస్తారు?... అంత అసహ్యంగా అన్నాడుగా? రోగ్!... శ్రీరాములూ! అతని బాకీ యిప్పుడే పారవేసి, రా,... అతనికి "వేశ్యలలోగూడా పతివ్రిత లున్నారని" నిరూ

మంచివాళ్ళెవరు?

పిస్తాను... శ్రీరాములూ! నీవింత తెలివితక్కువగా ప్రవర్తించావేం?

శ్రీరా:— ఏమీ?

శ్రీదే:— అతడు మన యిద్దరినీ అనుమానించినప్పుడు, "కాదని" యెందుకన్నావు? "నిజమే" అని అంటే కొంపలంటుకొని పోతాయా? అతడెవ్వడు మనలను శాసించుటకు?

శ్రీరా:— సోదరీ! నేను సత్యమాడితిని. అబద్ధ......

శ్రీదే:— ఇస్! మైడియ్యర్ శ్రీరాములూ! నేనొకవిషయం చెబుతాను, విను- నీవుయికమీదట, నన్ను "సోదరీ" అని సంబోధించవద్దు- నేను నిష్కల్మషహృదయంతో నిన్ను ప్రేమిస్తున్నాను.

శ్రీరా:— (ఆశ్చర్యముతో) ఆఁ! ఏమిటి విపరీతంగా మాట్లాడుతున్నావు?...

శ్రీదే:— విపరీతమేముంది? సహజమే!... నీవిషయం నాకనవసరము- నీవు నన్ను ప్రేమింపకపోవచ్చునుగాని, నన్ను ఆటంకపరుచుటకు నీకధికారంలేదు. నీకిష్టమైతే......

శ్రీరా:— అందువల్ల నీకేం సుఖము గలుగుతుంది?

శ్రీదే:— నా సౌఖ్యము- క్షేమము- నీవు కోరినవాడవైతే- యెప్పటికైనా నన్నుజూచి నీకు జాలికలిగితే, నాకానందము గలుగుతుంది- లేకపోతే- యింతే- ఇలాగే నిన్ను ధ్యానిస్తూ, కృశించిపోతాను......

శ్రీరా:— శ్రీదేవీ! ఎందుకు నీకీపిచ్చి?...

శ్రీదే:— మరియొకమాట!... ఇందువల్ల మీభార్యాభర్తల కేవిధమగు యిబ్బంది గలుగదని, నమ్మండి- నేను మీ దారికడ్డురాను - మీయిద్దరిని గురుభావంతో చూచుకొంటూ, సేవలుజేస్తాను... "శ్రీదేవి చాలమంచిది" అని, పదిమంది అనుకొనేలాగున నడుస్తాను...... కాబట్టి, ఈమాటలు నీవు కనకవల్లితోగూడా చెప్పి- ఆమెసమ్మతముమీదనే నన్ను స్వీకరించు!- చదువుకొన్నవాడవుగదా! యింతకన్నా చెప్పేదేమున్నది?...

శ్రీరా:— ......!

శ్రీదే:— అనుమానంవద్దు - నీకు నామీద గట్టిగా నమ్మకం కుదిరినప్పుడే, నన్ను పాలింపవచ్చును.

ము చివాళ్ళవరు?

శ్రీరా:— నీ వెన్ని చెప్పినా, నా అంతరాత్మ సమ్మతింపదు.

శ్రీదే:— పాషాణ హృదయము గాబోలు?

శ్రీరా:— ...నేను... మేరేజీ చేసుకొన్నాను...

శ్రీదే:— అయితే యేం? ఇద్దరుభార్యలను యేలుకోగూడదా? రెండుమూడు పెండ్లిళ్లు జేసుకొని అందరి భార్యలను పాలించిన, భర్తలు, మనదేశంలో యెందరులేరు?

శ్రీరా:— ఉండవచ్చును... కాని, నీవు భార్యవగుదువా?

శ్రీదే:— కాగూడదా?

శ్రీరా:— ఇంతకుపూర్వము నీవొకరిని, చేపట్టావుగదూ?

శ్రీదే:— అదొక్కటే నాలోనున్న దోషము... తెలిసో, తెలియకో, ఒక్కతప్పు జేసినంతమాత్రాన, నా జీవితము ధోగతిపాలు గావలసిందేనా?

శ్రీరా:— ఇది, అన్ని తప్పులవంటిది గాదు... నీవుచెప్పేది లోకసమ్మతంగాదు.

శ్రీదే:— వాట్, శ్రీరాములూ! డ్యామ్ వరల్డు!- ఈదయ్యము నిన్నింకా వదలలేదు... ఇప్పుడు తెలుసుకొన్నాను నిన్ను, మోసగాడవని...

శ్రీరా:— (కోపముతో జూచును.)

శ్రీదే:— (విసుగుతో) లాభములేదు... నీకోపము నన్నేమి జేస్తుంది? నీవు ముమ్మాటికి మోసగాడవే- చదువుకొన్నవాడవని, నీతినియమములు గలవాడవని- నిజమగు సంఘసంస్కర్తవని- నమ్మి- మనసిచ్చిమాట్లాడాను...

శ్రీరా:— నోటికివచ్చినట్లు వాగుచున్నావు, శ్రీదేవీ! నీమాట వినువారందరు దుర్మార్గులా? మోసగాండ్రా?

శ్రీదే:— కాదు- కాదు... స్త్రీకి పునర్వివాహము చేయవచ్చునని- అనాథలగు బాల వితంతువులను రక్షించవలెనని- లెక్చర్లు యిచ్చావుగదూ?

శ్రీరా:— ఆఁ!- అయితే?

శ్రీదే:— కార్యరంగములో, వెనుక్కు పరుగెత్తేవిన్న యేమని పిలవాలి?

శ్రీరా:— అర్థములేని పోలికలు! ...

శ్రీదే:— ఔనౌను- అర్థంగావు, పాపము!... ఆపద్దశలో నన్ను స్వీకరింపగూడదూ?

శ్రీరా:— బాగున్నది, నీవాదన... స్త్రీ పునర్వివాహపు పద్ధతి వేశ్యల కన్వయించదు.

నుంచివాళ్ళెవరు?

శ్రీదే:— వీళ్లు జేసిన పాపమేమో?

స్వార్థమున మానవులు సమసిపోవ,
"వేశ్యలని" ఒక్క జాతిని, వేరుపరచి,
సంతసించెడు రాక్షస జనము నేడు
ఇష్టపడుదురే వేశ్య పెండ్లి చేసేయ!

వేశ్యలందరు స్త్రీలవంటివారు గారా? వీళ్లకు హృదయంలేదా? ఎవరు నిర్మించారు, యీ అసహ్యకరమైన ఆచారాన్ని?

శ్రీరా:— శ్రీదేవీ! ఇన్ని మాటలెందుకు?

ఒక్క భర్తయు— ఒకమాట— ఒక్క నీతి
లేని వేశ్యవు— ఇపుడు, నీకొచ్చి పోరి,
బాసలను నమ్మ్మటలు, పరిహాసము కును,
నమ్మజాలను— లోకులు నమ్మలేరు.

శ్రీదే:— ఎంతమందికి మీరు మేరేజెస్ చేసి, పరీక్షించారు? ఆపరీక్షలో యెంతమంది ఫెయిలయినారు?... పెళ్లి విడాకులిప్పు జేస్తే భర్త యెలాదండించి వదలివేస్తున్నాడో, ఆవిధంగా నన్నుగూడా మీరు చేపట్టి, పాపము జేస్తే శిక్షించండి.— ఏం?

శ్రీరా:— ......!

శ్రీదే:— మాట్లాడరేం?

శ్రీరా:— శ్రీదేవి! నన్ను మంచితనంతో బలవంతముగా బాధపెడుతున్నావు... అయినా, యిప్పుడేమీ చెప్ప లేను... కనకవల్లితో యీవిషయం చెప్పి, ఆలో చిస్తాను.

శ్రీదే:— చెప్పండి- తప్పకుండా, నేను చెప్పినవన్ని, ఆమెకు చెప్పండి- ఆమె సమ్మతిమీదనే నన్ను స్వీకరించండి- ఒకదినము గడువిస్తాను—

శ్రీరా:— ఏమంత తొందర?

శ్రీదే:— తొందరే!- అంతవరకు మీతో మాట్లాడను- వెళ్లండి యిప్పుడే...

శ్రీరా:— (చిన్నబుచ్చుకొని) సరే- వెళ్లివస్తాను.

శ్రీదే:— ఎప్పుడువస్తారు?

శ్రీరా:— శ్రీదేవి- ఇవన్నీ నేను చెప్పటకంటె, కనకవల్లితో నీవే చెప్పకూడదూ?

శ్రీదే:— మీరే చెప్పకోండి- ఈప్రశ్న మీదికదూ? అది గాక, యెవరుచెప్పినా ఒకటే,- కనకవల్లి జాలిగుండె

మంచివాళ్ళెవరు?

గలది- స్త్రీల సాధక బాధకాలు ఆమెకు చక్కగా తెలుసు- తప్పకుండా వొప్పుకుంటుంది...

శ్రీరా:— అంతా నీవే చెప్పేస్తున్నావే? సరే...

(వెళ్ళబోవును.)

శ్రీదే:— ఇదుగో! మాట- మాట!

(శ్రీరాములు వెనుకకు దిరిగివస్తాడు)

శ్రీదే:— రెండుమాటలు విను... డబ్బుకాశించి మాఅమ్మ మొదట నాకొక పశువును అంటగట్టింది- నేను తెలియక మోసపోయి, తర్వాత గ్రహించి, మూడుమాసాలకే వాణ్ణి తరిమివేశాను. ఇంతవరకు నాజీవితంలో నేనుజేసినతప్పు యిది... ఈమాత్రానికి నన్ను క్షమించవచ్చు... ఇకముందంటావా? నేనిందాక చెప్పినట్లు చేయవచ్చు... సరేనా?

శ్రీరా:— ......?

శ్రీదే:— నేను మీ భార్యాభర్తల అన్యోన్యానురాగానికి యేమాత్రము ఆటంకము కలుగజేయను- ఒక దాసివలె మీకు సర్వీసుచేస్తాను. యుకేస్ బిలీవ్ మి- అది

గాక- నాకున్న యిరవైవేలు కిమ్మత్తుజేసే, ఆస్తిఅంతా నీకే యిస్తాను... కాబట్టి, బాగా ఆలోచించుకో...

శ్రీరా:— (ఆలోచిస్తూ) ఎవరు సంపాదించారు యీఆస్తిని?

శ్రీదే:— మాఅమ్మ ఆర్జించి, మరణకాలములో నాకుయిచ్చి పోయింది. మామదర్ గతించి, యెనిమిది మాసా లేగా? నీకు తెలియనిదేమున్నది?... ఇకపో! ఇవిగో ఈ రూపాయిలు హనుమయ్యకిచ్చి, బాకీ రద్దు జేసుకో!...

(శ్రీరాములు రూపాయిలు తీసుకొని వెళ్లిపోవును.— తెరవాలును.)



# మూడవ అంకము.

## 1. వ రంగము.



(హనుమయ్య వసారాలో పడకకుర్చీయందు కూర్చొని యుండును.)

హను:— ఇంతస్వల్పకాలములో...?... అశ్చర్యము!...... ఇంతతొందరగా యేడువేలు అయిపోయినవే? ఈపద్ధతి చూస్తే, నాఆస్తి అంతా ఒకసంవత్సరముకంటే యెక్కువ వస్తుందా? ...అసలు యింతడబ్బు యెలాఖర్చైనట్లు? పదిమంది పెద్దలూగలిసి నన్ను పీడించగా, పీడించగా, ఒక్క వెయ్యిరూపాయిలు మాత్రము నాటకశాలకిచ్చాను... మిగిలిన ఆరువేలు?... అబ్బబ్బ! ఈస్నేహితులు నాకొంపతెంపారు. మొన్న పారిస్‌నుంచి తెప్పించిన టాయిలెట్సుకే నిన్నటిలు హాండ్రెడ్ చెల్లించాను... అయినా, నేను ఫూల్‌నుగాక పోతే, మొన్న జాలీక్లబ్బుకు యిచ్చిన డొనేషన్, యెందుకు?... కేవలము అనవసరమేగా? ఛీ! ఛీ!—

వ్యాపారంలేదు సరేగదా, పైగా, వున్నది అమ్ముకొని గంతులు వేయడమా?... నాకీ విడో సిస్టరుదొంగ ట్రిబులు!...

(చిన్నమ్మ కులుకుతూ, ప్రవేశించును- వయస్సు 18 సంవత్సరములు- నవనాగరికపు వేషము- నల్లగావుంటుంది- మంచి, మంచినగలతో, ముత్తైదువులాగవుంటుంది)

చిన్న:— అన్నయ్యా! పంతులుగారు యీ హార్మోనియం పనికిరాదన్నారు... మంచిదిగాదుట...

హను:— (విసుగుతో) పనికిరాకపోవడమేమిటి? మొన్ననేగా తెప్పించింది? కొత్తది అప్పుడే చెడగొట్టినట్లున్నావు!

చిన:— నాకేం తెలుసు? కొత్తదే అసలు బాగుండలేదన్నారు పంతులు...

హను:— ఏడ్చినట్లేవున్నది, నీచదువు? సరే, పంతులుగారితో నేను మాట్లాడతానులే, పో!

(చిన్నమ్మపోవుచుండ, మస్తాన్ యెదురుపడును. చిన్నమ్మ నవ్వుచు పోవును.)

మస్తాన్.— సలాం! అయ్యా!

మంచివాళ్ళెవరు?

హాను:— ఏం, మస్తాన్! దా! కూచో!... వాట్ న్యూస్? యేం విశేషాలు?

మస్తాన్:— క్యాఫ్రుండవ్, మహారాజ్!

హాను:— చూచావా, శ్రీదేవి సాగరు?

మస్తాన్:— సాగర్ గిగర్, యెల్లిపోతావ్, జరా ఖైరో, సాబ్!

హాను:— సరేగాని, మన మునిసిపాలిటీ యెన్నికలు సమీపిస్తున్నయి- తెలుసునా?

మస్తాన్:— యిన్నాం! యిన్నాం! నిన్న చెప్పారుగా! మీకి, నిల్వడం ఖాయం?

హాను:— ఏమో! మీరందరు హెల్పుచేస్తామంటే చూస్తాను.

మస్తాన్:— యుధ్వలంవర్, వచ్చారుగా, మహారాజ్! మీకి యేంతక్వ? మీకి నిల్చాతో, భంఛేత్ పేరుసెప్పి గెల్పిస్తాం! దెఖో!

హాను:— మరైతే, ఆప్రియత్నంలోనే వుండు.

మస్తాన్:— ప్రియత్నం, గియత్నం, యెందుకండీ? భంచెత్ మాకీ చూశాతో, అడ్డమువచ్చే యుధ్వ కౌన్?

జరాతక్క రెండువందల్ వోట్లు మాదీ యిలాగా
వుండయ్!

హాను:— ఎలాగూ? అయితే గెలిచామన్నమాటే!

మస్తాన్:—ఓ!

(శ్రీరాములు ప్రవేశించును)

హాను:— శ్రీరాములూ! రా! కూచో!

(శ్రీరాములు గూర్చొనును- చిన్నమ్మవచ్చి, అటూ యిటూ
తిరుగుతూ, మస్తాన్‌వంక నవ్వుతూ జూస్తుండును.)

శ్రీరా:— మిష్టర్, హనుమయ్యా! టేక్ యువర్ మనీ!

హాను:— ఓ! పైకం తెచ్చావ్ బ్రదర్! అంతావుందా?

శ్రీరా:— ఆఁ! నీకివ్వవలసినది వడ్డీతో గూడా కలిపి తెచ్చాను.

(హనుమయ్య రూపాయిలు లెక్కపెట్టుకొంటుంటాడు-మస్తాన్
చిన్నమ్మ యితరులకు తెలియకుండా కనుసైగలు
చేసుకొంటుంటారు.)

శ్రీరా:— సరిపోయినయా? రశీదు...?

(హనుమయ్య రశీదు వ్రాసియిచ్చి)

హాను:— ఇదంతా శ్రీదేవి పుణ్యమేననుకొంటాను.

మంచివాళ్ళెవరు?

శ్రీరా:— అవన్నీ నీకనవసరం.

హను:— ఇదుగో! సరేగాని... (మస్తాన్‌వంకజూచి) మస్తాన్! నీవికపో!

మస్తాన్:— అచ్చా! జరా పైసాదేవ్ అయ్యా!

హను:— ఇస్తాను- ఒకగంట ఆగిరా!

(మస్తాన్ చిన్నమ్మనుచూస్తూ వెళ్ళిపోవును)

హను:— శ్రీరాములూ! శ్రీదేవి, నీకేమైనా మందు పెట్టిందా, యేమి?

శ్రీరా:— వాట్ మ్యాడ్ ఫెలో యూఆర్! మందేమిటి?

హను:— మ్యాడ్ ఫెలోవే అయినావు, గాని...

శ్రీరా:— (గర్వంతో) శ్రీదేవిని జూచి, ఫామిలీ గరల్సు నేర్చుకొనవలసిన విషయాలు యెన్నోవున్నాయి.

హను:— ఔనౌను... పాతలంజలు లోకమాతలయినారు.

శ్రీరా:— (కోపంతో) ఇలాంటిమాటలు యింకెప్పుడు నాతో అనబోకు... తెలిసిందా?

హను:— నీకెందుకు కోపం?

శ్రీరా:— ఎందుకా; సద్గుణులను దూషిస్తే, సజ్జనులు విని సహించలేరు.

హను:— అబ్బో! "సద్గుణులు- సజ్జనులు- సహించలేరు"...
వెరీగుడ్! కవిత్వం జెప్పేశావ్!

శ్రీరా:— నేనిక వెళ్లుతాను (అని లేచును)

హను:— (ఆపి) కూచో!కూచో! వ్యాపారం బాగాసాగుతు
న్నదా?

శ్రీరా:— అది మన బిహేవియర్ నబట్టి వుంటుంది.

హను:— బిహేవియర్ను బట్టే, బాగా వున్నదా అని
అడిగాను.

శ్రీరా:— ఆc! చక్కగా సాగుతున్నది. (లేచును)

హను:— సో హార్రీ! ఆల్ రైట్! గోయవే, మ్యాన్!

(శ్రీరాములు వెళ్లిపోవును- తెర వాలును.)



మంచివాళ్ళెవరు?

# మూడవ అంకము.

## 1. వ రంగము.



(హనుమయ్యా గూర్చొనియుండును.)

హాను:— ఎందుకు డబ్బు? అవసరము వచ్చినప్పుడు దాని యోగపరచుకోలేని లక్షాధికారికంటె, భిక్షాధికారి మేలు- కోరికలు తీర్చుకొనుటకు పనికిరాని భాగ్య మెందుకు?... ఎన్నిలక్షలు ఖర్చుజేసినైనా పరాభ వాగ్ని చల్లార్చుకోవాలసిందే... నీచకులంలోపుట్టిన శ్రీదేవియెక్కడ?...ఛీ! ఛీ!... ఏమిజూచుకొని దీని కీగర్వం? ఎందులో పోల్తుంది?... నాకు కావలసినంత డబ్బువుంది- బి, ఏ., ప్యాసయినాను. - గౌరవనీయుణ్ణి తవకంటె యెక్కువకులంలో పుట్టాను... ఇతవాణ్ణి- నన్ను... యెందుకు పనికిరాని ఒక అబల,- అందులో వేశ్య- పురుగును విదిలించినట్లు విదిలిస్తుందీ?... దీన్ని యేంజేస్తే పాపముందీ?... షేమ్! షేమ్! ఇ· కెందుకు నాబ్రతుకు? పరువు మర్యాదలులేని ఒక డ్యాన్సింగు

గరల్ చేత "నోరుముయ్!" అని అనిపించుకొని, పది మందిలో తలయెత్తుకొని తిరుగుటకంటె, ఆత్మహత్య జేసుకొనుటమేలు... అయినా, నావల్ల తప్పేముంది వెలకాంతగనుక అడిగాను... సర్లెన్లి! బజారులో శరీరము అమ్మకొనేజాతి- దానిమీద అందరికీ హక్కు వున్నది... ఒకవేళ అడిగితేమాత్రం? ఇష్టంలేకపోతే "రానని" అనవచ్చునుగాని అలాఅంటుందా? "బుద్ధి తెచ్చుకో" అని అంటుందా?... ఆల్ రైటు! అయి విల్ సి,...... మస్తానొక ఫూల్- చెప్పినదితప్ప, అన్ని చేస్తానంటాడు... (ఆలోచిస్తూ) ఏయ్! ఎవరక్కడ?

(చిన్నమ్మ ప్రవేశించును.)

హను:— మీ వొదినేదీ?

చిన్న:— దొడ్లో పనిజేసుకొంటున్నది.

హను:— ఈ కోటు, యింట్లో వంకెమీద తగిలించి, త్వరగా వంటకావాలని మీ వొదినతో చెప్పు. ఇకపో!... నావైఫ్ ఒక విలేజిబూ్రిట్! సరిగా మాట్లాడుట గూడా చేతగాదు... ఇలాంటివాళ్ళతో యేమిసౌఖ్య ముంటుంది? యేమికుస్తుంది? మాయిద్దరికి ముడిపెట్టిన భగ

మంచివాళ్ళెవరు?

వంశానికి బుద్ధిలేదు. అతను అన్నీ యిలాంటి అవక తవక పనులే జేస్తుంటాడు......

(మస్తాన్ మెల్లగా ప్రవేశించి, చిన్నమ్మగారకు అటూ, యిటూ, జూస్తూ,)

మస్తా:— (తనలో)... అరే! కనపడింది లేదు... వుడాయించింది, క్యా? భంచేత్, అదిమాకి జరాస్ చూశాతో వా రెవా! ఇందర్ భోగం!

(చెంపలువోట్టుకొనుచూ, తలూలున హనుమయ్యను జూచి, భయముతో)

సలాం! మహారాజ్! సలాం!

హను:— ఏం, మస్తాన్! ఇవ్వాళ నీకు తీర లేదా?

మస్తా:— లేదూ అయ్యా! ఖర్ మే ఖాళీ వుండామ్- జరూర్ క్యా?

హను:— నీతో చాలా పనివుంది.

(ఇంతలో చిన్నమ్మ లోపలనుంచి తొంగిచూచును- మస్తాన్ లొట్టలు వేస్తూ, ఆమెను చూచి, భయముతో హనుమయ్యను చూచును.)

మంచివాళ్ళెవరు?

హను:— మస్తాన్! నీవొక గొప్పపని రహస్యంగా, చేయ వలసివుంది. ఇదినీవు మహా తెలివి తేటలతో చెయ్యాలి ...మంచి బహుమానం యిస్తాను.

మస్తా:— ఓ! తయార్! బోలో!

హను:— ఇక్కడగాదు... లోనికేగి మాట్లాడుకొందాం రా!

(నిష్క్రమింతురు- తెరవాలును.)

శ్రీ వేమన గ్రంథాలయము
కొండ్రోలు.

మంచివాళ్ళెవరు?

# నాలుగవ అంకము.

## 1. వ రంగము.

---

(శ్రీదేవి పడకగది- అందమైన సోఫాపై శ్రీరాములు, శ్రీదేవి కూర్చొనియుందురు

శ్రీదే:— ఇది సుదినము- మిమ్ములను సమ్మతింపజేయు గలిగి నందుకు సంతోషముతున్నాను... గాని, మీరు మహా పెంకెమనుష్యులుసుమా! అన్నివిషయాలలోను యింత పట్టుదలకూడదు- దేర్ షుడ్ బి, మార్జిన్!

శ్రీరా:— యస్! బట్, నాట్ యిన్ దిస్ సార్ట్ ఆఫ్ కేసెస్- ...ఏమంటావు?

శ్రీదే:— ఏమంటాను? మీవి వేదవాక్యాలు...

శ్రీరా:— ముఖప్రీతికోసము అనకు...

శ్రీదే:— ఇకముందు మీరేమిచెప్పినా "సరే" అనవలసిందే గాని, "కాదు" అనటానికి వీలులేదుగా?

శ్రీరా:— అలా, కట్టుబాటుకు లొంగావుగదా?

శ్రీదే:— తప్పుతుందా, కట్టుకొన్నతర్వాత?

శ్రీరా:— కట్టుకొన్నామా? నో,! నాట్ యట్,

శ్రీదే:— వుయివిల్ ... ఇన్ కవుల్ ఆఫ్ హావర్సు.

శ్రీరా:— (నవ్వుతూ) హూ సెడ్?...సో, సూన్?

శ్రీదే:— (వికటముగానవ్వుతూ) ఓహో! మళ్ళీ బేరమా?

శ్రీరా:— అసలు అవసరమేమిటి?

శ్రీదే:— అవసరమేలేదు- మనసుకలిస్తే...

శ్రీరా:— ఆల్ రైట్! కం; లైక్ దట్! దాంపత్యధర్మాన్ని బలపరిచేవి, మంగళసూత్రము, వూరేగింపులు-గావు తెలుసునా?

శ్రీదే:— నిజమే- అవన్ని ఆడంబరముకొరకు,- లేకపోతే, కాదని తగాదాకొస్తే, సాక్ష్యముండడానికి.........

(శ్రీదేవి ఆకులు చుట్టియిచ్చును. శ్రీరాములు తీసుకొంటూ,)

శ్రీరా:— సరేగాని, నీవు కొన్ని షరతులకు సమ్మతించాలి... అందాకా...

శ్రీదే:— వీలున్నవేనా?

మంచివాళ్ళెవరు?

శ్రీరా:— కఠినమైనవిగావులే!... మొదటిది, బ్రతికివున్నంత వరకు నీవు మరొకదారి త్రొక్కగూడదు- నామాట మీరగూడదు.

శ్రీదే:— ఇస్! ఇదేనా? బాసచేస్తున్నాను, అలాగేవుంటానని.

శ్రీరా:— మరొకటి ముఖ్యమైంది- నీవు మాయింట్లోవుండి భోజనాదికములు చేయగూడదు- మాయింట్లో నీతో పాటు భోజనాదికములకు నన్ను పిలువగూడదు.

శ్రీదే:— (నవ్వుతూ) ఎవరు నెక్కించారు, నీకీపిచ్చి? మనసు గలిస్తే, యివన్నీ మానగలమా?

శ్రీరా:— అదంతానాకు పనికిరాదు,- నీకులంనీది- నాకులం నాది- తరతరాలనుండి వస్తున్న, యీకట్టుబాటును మనము తప్పించగూడదు.

శ్రీదే:— తరతరాలనుండి వస్తున్నయిగా? ఇడ్డీకట్టుబాట్లు! నీకింకా యీఛాందసం పోలేదేం? సంస్కరనని చెప్పకుంటావే? వంచకుడా!

శ్రీరా:—సంస్కర్తనైతే, నీయింట్లో భోజనముచేయవలెనా? ఏమిటీ తెలిసీతెలియనిమాటలు?

శ్రీదే:— నాకా తెలియంది? నీకా?

శ్రీరా:— ఇప్పుడీ వాదనలన్నీ అనవసరము- నాయిష్టంనాది-
నీకు సమ్మతమైతేచూడు.

శ్రీదే:— అబ్బబ్బ! ఏం, వేధిస్తున్నారండీ?- సమ్మతి చాలే!
ఇంతేనా? ఇంకావున్నయా?

శ్రీరా:— ఇక లేవుగాని...

శ్రీదే:— అయితే ఆజ్ఞదయచేయండి! ఒక్కటి......

(అని ముద్దుపెట్టుకోబోవును.)

శ్రీరా:— (వెనుకకుతగ్గి) ఆఁ! ఆఁ! వుండు... ఒక్కనిమి
షము......

శ్రీదే:— (నిరుత్సాహముతో) అబ్బ! రసభంగం!......ఆఁ!
చెప్పండి!......

శ్రీరా:— ఏమిటీ పచ్చి శృంగారము?

శ్రీదే:— సరేలే! (అని బలవంతముగా చెయ్యిబట్టికొనును-
తెరవాలును.)

## 2. వ రంగము.



(సమయము సాయంకాలము- శ్రీదేవి ఉయ్యాలబల్లపై కూర్చొని ఊగుచు' ఉల్లాసమున పాడుచుండును.

జై! జై! జై! భారతమాతా! జై! జై! జై!
మాతా! శుభపూతా, వర
వేషా! ఓ భరతమాతా!............జై! జై!
శౌర్య, ధైర్య సమన్వితా!
సకలదేశపూజితా!............... జై! జై!
హే......! సర్వసస్యఫలజల సంపత్ప్రదాయినీ...!
సర్వదురిత నాశనీ...!
దేశమాత! తనయులమము దీవనలిడి పాలింపుము...జై! జై!

శ్రీరాము డింకా రాలేదే?... వ్యాపార మెట్లున్నదో? శ్రీరాములు నేర్పరి. చక్కగానే సాగిస్తాడు. సందేహములేదు. అనుకోరాదుగాని, యితడు సద్గుణ సంపన్నుడు- పేదవాడైతేమాత్రమేమి? సాధారణంగా బీదలయందే ఉత్తములుంటారు- శ్రీరాములు ఉన్నతాశయములు గలవాడు. నాతో ననేకపర్యా

మములు "నీచములకు పాల్పడక, సడలని పట్టుదలతో వుండే, ఆత్మశుద్ధిగలవారికి, తప్పక జయము చేకూరును." అని అన్నాడు. రక్షకుడితనిని త్వరలో సంపన్నుని జేయుగాక!...... (కొన్ని నిమిషములాగి) వాట్ ఈజ్ దిస్? దుశ్శకునము లగుచున్నవే!... (గడియారము ఆరుగంటలుకొట్టును.) ఆరుగంటలా? అప్పుడే! అయితే దేవాలయమునకేగు వేళైంది. (అని లేచి పూజాద్రవ్యములుగల వెండిపళ్ళెమును దీసుకొని వెళ్లుతుంది.)

(తెరయెత్తబడును.)

(దేవాలయపు టావరణము- శ్రీదేవి ఆలయములో ప్రవేశించి పూజచేసి వచ్చుచుండును - మస్తాన్ కాచుకొనియుండును.)

మస్తా:— (దారికడ్డముపోయి) ఏయ్! పిల్లా!

(శ్రీదేవి ఉలికిపడి తిరిగిచూచును.)

మస్తా:— జరాఠైరో! ఒకటిమాట వుండావ్!

శ్రీదే:— హూ ఈజ్ దట్! ఎవరునాయనా నీవు? నీచత్వానికి పాలుపడుచున్నావే!

నుంచివాళ్ళెవరు?

(మస్తాన్ తటాలునవచ్చి, శ్రీదేవిని బలవంతముగా యెత్తుకొని భుజముమీద వేసుకొనును- శ్రీదేవి తన చేతులోవున్న వెండిపళ్ళెమును విడిచిపెట్టి మస్తాన్ మెడను కొరకగా,అతడు ఆమెను విడిచిపెట్టును)

మస్తా:— అరే! భంచేత్! కొరుకుతావుబే? దేఖో మజాఖా!

(అని చేతులపై చొక్కా సర్దుకొనును.)

(శ్రీదేవి మొలనున్న వడ్డాణమునుదీసి కొట్టవచ్చినట్లు నిలువబడి, కనులెర్రజేసి)

శ్రీదే:— ఫూల్!సమీపించావా, చస్తావు! మెడ తెగిపోతుంది.

(మస్తాన్ నిశ్చలుడై చూస్తుంటాడు. ఇంతలో పూజారివచ్చి)

పూజా:— శ్రీదేవీ! ఏమిటీగోల? వీడెవడు? మస్తానా?

(మస్తాన్ పరుగెత్తును.)

పూజా:— శ్రీదేవీ! ఏంజరిగింది? ఇప్పుడేగదూ, నీవు గుళ్ళో నుంచివచ్చావు? ఇంతలోయీదొంగముండాకొడుకు...

శ్రీదే:— మహాత్మా! వీడు యీచాటున దాగియున్నాడు గాబోలు, నేనువచ్చేవరకు అకాత్తుగా నామీదబడి నన్ను బలవంతముగా తీసుకొనిపోవుటకు ప్రయత్నిం

చగా, నేను వాణ్ణి, గట్టిగా కొరికాను అంతట నన్ను విడిచిపెట్టాడు... ఇదీజరిగిన విషయము- వీడిని మీా రెరుగుదురా? "మస్తాన్" అని పిలిచారే?

పూజా:— ఔనమ్మా! వీడు హనుమయ్య నౌకరు- ఒకటి రెండుసార్లు హనుమయ్య వెంట తిరుగుచుండగా చూచాను.

శ్రీదే:— (కోపముతో) యూా స్కౌండ్రెల్! ఎంత నీచానికి వొడిగట్టావు? ఏంజూచుకొని నీకీ కండకావరము? నీయింట్లో, నీవైఫ్, మదర్, సిస్టరు, యెలావున్నారో ఆలోచించుకొన్నావా? బుద్ధిలేదూ? ఇంట్లోవాళ్ళను మేనేజ్ చేసుకొనుట చేతగాక, అధముడికి నీకు పర కాంతలు కావలెగా? సిగ్గులేక, తలయెత్తుకొని నేనొక మనిషిని అంటూా తిరుగుతున్నావు! పరువుమర్యాదలు లేని పశువా? ఎప్పుడో నీపాపము బ్రద్దలౌతుంది. స్త్రీల నపహరించదలచిన నీశిరసు నేలబడదూ? నీ నీచ కార్యాలకు- నీ అక్రమాలకు- నీ అప్రమాణాలకు- యెప్పుడో ఒకనాడు నిన్ను ప్రజలందరు కుక్కనుగొట్టి నట్లు కొట్టరూా! మానవతుల నేడ్పిస్తే, వృథాగా

మంచివాళ్ళెవరు?

పోతుందీ? రూపములేకుండా మాడిపోవ్వా?.........
ఓరిగాడిదా!... నన్ను చెరచవలెననే పట్టుదల నీకెం
దుకు? దానివల్ల నీకేమి కీర్తివున్నదీ?... ఛేపో,
మెల్లుండో సివిల్ జైలుకు పోవలసిన, చేతగాని అడ
ముండకు, నీకింత పట్టుదలవుంటే, ఉత్తమస్త్రీనైన
నాకు వుండగూడదు?... తెలుసుకొందువుగాక! వేశ్య
లలో పతివ్రతలున్నారని..., అవసరమైతే, పరీక్షకు
నిలిస్తే, వేశ్యలు అన్నివిధాల, కులకాంతలను మించు
తారని గ్రహింతువుగాక! ఇదే నాశపథము!...స్త్రీలు
దుర్బలులని, సులభంగా ఎత్తుకొని పోవచ్చునని
అనుకొన్నావు గాబోలు... కాదు-కాదు-శృంగారరస
స్వరూపిణియగు స్త్రీ, మానము కాపాడుకొనవలసి
వచ్చినప్పుడు భయంకరమైన బ్రహ్మరాక్షసి అవుతుంది
... తెలుసునా?...

పూజా:— శ్రీదేవీ! మస్తాన్ పారిపోయినాడు. ఇక్కడ
మెవ్వరులేరు- శాంతించు-

శ్రీదే:— (తెప్పరిల్లి) కోపంచేత అన్నానుగాబోలు- (వడ్డాణ

మును సవరించుకొని, క్రిందబడ్డ పళ్ళెమును తీసు కొనును.)

పూజా:— ఆతుంటరి మళ్ళీ, దార్లో నీకెదురుపడతాడేమో? మీయింటివరకు నేను తోడువచ్చేదా?

శ్రీదే:— మీకెందుకు ఆశ్రమ? ఇంకావస్తాడా? వస్తే ప్రాణంతో వెళ్ళగలడా?

పూజా:— అలాగాదు. ఆడుదానవు. నీకు తెలియదు- ఎందు కయినా మంచిది, వస్తానుపద...

(ఇద్దరు వెళ్ళుతారు)

3. వ రంగము.



(హనుమయ్య యిల్లు- సమయము, ఉదయము 4 గంటలు)

హను:— మస్తాన్ చేతగానివెధవ- ఏపనిజెప్పినా, చెడగొట్టు కొనేవస్తాడు. ధనము గుంజుటలో మాత్రము తెలివి తేటలున్నాయి... తెల్లవారితే పోలింగుజరుగుతుంది... వోటర్లను తీసుకొనివస్తానని వెళ్ళి యింతవరకు రాలేదు-

మంచివాళ్ళెవరు?

పోటీ తీవ్రంగావుంది, నాయుడి విషయము లెక్కలేదు గాని, శర్మనుమాత్రం కనిపెట్టివుండాలి.-ఉన్నవోట్లలో సఖం శర్మవే! (గడియారముచూచి) నాలుగు దాటింది...

(ఇంతలో మస్తాన్ నలుగురు వోటర్లను తీసుకొనివస్తాడు.)

1 వ, ఓటరు:— దణ్ణాలు!

హాను:— కూర్చోండి (కుర్చీలుచూపి) ఏమండీ! మీాయిలాకా వున్న వోట్లెన్ని?

1 వ, ఓ:— ఇరవైఆరు.

హాను:— ఈ యిరవైఆరు మాకు ఖాయమేగద?

1 వ, ఓ:— ఇంకా సందేహమాఅండీ! తమమాటకాదని బతకగలమా?

హాను:— నిన్న మస్తాన్ మీాకెంత యిచ్చాడు?

1 వ, ఓ:— నూరు. ఏం? అంతేనా, సాయిబూ,

మస్తా:— ఒత్తాచ్ అయ్యా!

హాను:— ఇంకా కావలెనా?

1 వ, ఓ:— చిత్తం! మీాదయ!

హను:— ఏంగావలెనంటారు? ఇదుగో! ధనమే ప్రధానము గాదు. ఎప్పుడు అవసరమైన మనిషిని నేను.

1 వ, ఓ:— చిత్తం!... (2 వ, ఓటరును చూచి) ఏరా!

2 వ, ఓ:— మూడొందల లిప్పించండి... నాయుడుగారు ఐదు వందలు యిప్పిస్తామంటే, కాదని వచ్చాము.

హను:— అబ్బో! చాలా అడుగుతున్నారు... బాగా ఆలోచించి చెప్పండి!

1 వ, ఓ:— ఇకనేమీ లేదు... నాయుడుగారు యింటిచుట్టూ కావలిపెట్టినా, తప్పించుకొని వచ్చాం! అంతకు తగ్గితే మావాళ్ళు కాదంటారు.

హను:— సరే- ఇస్తానురా! (లోపలికి తీసుకొనివెళ్ళి, రూపాయిలుయిచ్చి, వచ్చి) మీరు పోలింగుస్టేషనుకు పోండి! వేళగావచ్చింది... మోసము చేయవద్దుసుమా!

(ఓటర్లు తిరిగిచూడకుండా వెళ్ళుతారు.)

హను:— మస్తాన్! పేరయ్య ముఠాకు అంతా ముట్టినట్లేనా? రెడ్డి వగయిరా లందరికి చెప్పివచ్చావుగదూ?

మస్తా:— చేశాం మహరాజ్! చేశాం!

మంచివాళ్ళెవరు?

హాను:— ఇందులో యెవ్వరు మోసంజేయరుగదా?

మస్తా:— మోషం? మోషం గీషం చేశాతో, మాదిపాణం తీస్తావులేవ్!

హాను:— (గడియారముచూచి) అయిదుగంటలైంది-మస్తాన్ నీవింకపోయి, మనవాళ్ళందరని తీసుకొనిపోయి, పోలింగుష్టేసువద్దవుండు- పద!- ఆఁ! ఇందా! (అని కొన్ని రూకలిచ్చును.)

(మస్తాన్ నడచి, దొడ్డిగుమ్మమువద్ద నిలువబడి, యీలవేసి చిన్నమ్మను పిలిచి, సరసమాడి వెళ్ళును.)

## 4 వ రంగము.



(పోలింగుష్టేషను)

(పోలింగు ఆఫీసరు సూటువేసుకొని, దర్జాగా, కుర్చీలో కూర్చొనివుంటాడు- ప్రక్కన గుమాస్తావుంటాడు- ఆసమీపములో, నాయుడు, శర్మ, హనుమయ్య కుర్చీలలో కూర్చొన్నారు. ఇద్దరు పోలీసుజవానులు ద్వార

మ వద్ద కావలిగాస్తున్నారు- వెలుపల ఓటర్లందరు గుంపులు గుంపులుగా, చేరారు. ఏజంట్లు ఓటర్లను వెంబడించి బోధిస్తున్నారు- మరికొందరు యేజంట్లు చిన్నచిన్న కాగితాలమీద నెంబర్లువేసి ఓటర్లకు యిస్తున్నారు. ఒక వోటరు లోనికిప్రవేశించి, తన చేతులోవున్న కాగితపుముక్కను ఆఫీసరు చేతికిచ్చి బల్లవద్ద నిలవబడి వుంటాడు)

ఆఫీ:— (కాగితము చూచి) నె 44 గు (జాబితాలో చూచి) నీతండ్రిపేరు?

ఓట:— నాతండ్రి యీరారెడ్డి- నేను సోమిరెడ్డిని- యింటి పేరు కన్నావారు- సరేనా?

ఆఫీ:— ఆఁ! చాలు- చాలు- చదువుకొన్నావా?

ఓట:— చదువుకొంటే, యీగహాచారమేం, దొరా?

ఆఫీ:— అయితే, మరి, నీవోటు యెవరికివేస్తావో చెప్పు.

ఓట:— అదుగో! ఆకూచొన్నాయనకు...

ఆఫీ:— అలాగాదు- పేరుచెప్పు.

ఓట:— మడిసిని చూపిస్తుంటినిగంద? ఇంకా పేరెందుకూ అంట?

మంచివాళ్ళెవరు?

ఆఫీ:— ఇస్! అదంతా పనికిరాదు- తెలిస్తెచెప్పు- లేకపోతే వెళ్ళిపో!

నాయుడు:— (ఓటరునుజూచి) చెప్పరాదటోయ్! పేరు-!

శర్మ:— (నాయుడితో) మీరు మాట్లాడగూడదు సార్!

నాయు:— మీరెవరండి అలా ఆజ్ఞాపించుటకు?

ఆఫీ:— నాయుడుగారూ! మీకెందుకు, మీరు మాట్లాడకండి!

నాయు:— తెలియకపోతే, చెప్పగూడదు, సార్!

శర్మ:— యుషుడ్ నాట్ టాక్...

నాయు:— హూ ఆర్ యు? షటప్!

ఆఫీ:— అయ్యో! మీయిద్దరిని బయటికి పంపవలసివస్తుంది. తెలిసిందా? (అని, ఓటరునుజూచి, కోపంతో) చెప్ప వోయ్! యెవరికిస్తావు, నీవోటు?

ఓట:— నాయుడుగారి కండి!

(శర్మ కోపంతో ఓటరును చూస్తుండును- ఆఫీసరు కాగితము మడిచి, పెట్టెలో వేసి, ఓటరును వెళ్ళమని చెప్పును.)

మంచివాళ్ళెవరు?

(మరియొక ఓటరు ప్రవేసించును.)

ఆఫీ:— (జాబితాచూస్తూ) తండ్రిపేరు?

ఓట:— తెలవదు.

ఆఫీ:— వాట్! నాన్సెన్స్!

ఓట:— ఏమండోయ్! మాటలు తిన్నగా రానీయండి! నాన్సెన్సు, అంటే వూరుకోం...

హాను:— కళావంతులుగాబోలు! తల్లిపేరడగండి!

ఆఫీ:— ఓ! అయిసీ! ఆఁ! తల్లిపేరు చెప్పవోయ్!

ఓట:— ఇందిర- నేను చదువుకొన్నాను.

ఆఫీ:— (కాగితమిచ్చి) అదుగో! ఆమూలకుబోయి నీవోటు వేసిరా!

(మరియొక ఓటరు ప్రవేశించును.)

ఆఫీ:— నె 56 రు... తండ్రిపేరు?

ఓట:— జాలయ్య... నాపేరు సుబ్బయ్య... యింటిపేరు పల్లేవారు.

ఆఫీ:— చదువుకొన్నావా?

ఓట:— లేదు, దొరా!

మంచివాళ్ళెవరు?

ఆఫీ:— ఎవరికేస్తావు నీవోటు?

ఓట:— శర్మగారికండి!

హాను:— పేరు తప్పండి- ఆవోటరు యితడుగాడు.

ఆఫీ:— ఏమిటీ?

హాను:— పేరు తప్పండి! జాబితాలో, "వెంకటసుబ్బయ్య" అని వున్నది. ఆవోటరు యీమనిషిగాడు.

ఓట:— (హానుమయ్యతో) ఇదుగో! ఇలాంటి మారుమనువు మువారాలు మనయిగావు- జాగ్రత్త! ఓరనుకొన్నావో?

శర్మ:— సార్! సార్! హియర్ మి! ఇతనిపేరు అసలు వెంకటసుబ్బయ్యేనండి! సుబ్బయ్యా అని పిలుస్తుంటారు... అంతేగదుటోయ్!

ఓట:— చిత్తం!

హాను:— నోసార్! దట్ కెనాట్ బి యెలావ్డ్!

ఆఫీ:— ఇటీజ్ మైనర్! సిడౌను!

(అని వోటువేసి, వోటరును పంపివేయును. హానుమయ్య వెలుపలికివచ్చి "పోలింగు ఆఫీసరు అన్యాయము చేస్తున్నాడు" అని, కలెక్టరుకు టెలిగ్రాము యిచ్చును. ఆఫీసరు మరికొన్నివోట్లు వేయించి, 12 గంటలు

కాగానే పోలింగు ఆపుచ- అందరులేచి, భోజనాలకు వెళ్ళుదురు.)

## ౫. వ రంగము.

(హనుమయ్య మాసిన దుస్తులతో, యేకాంతముగా దిగులు పడి కూర్చొనియుండును )

మస్తాన్! మస్తాన్!... ఎంతవాడవురా! నిన్నేమేం జేస్తే పాపమువుందీ? నీపాపాలకు తగినశిక్షయేదో?... ఎవరు శిక్షించేవారు?... ఈసామిద్రోహిని... తిన్నయింటి వాసాలు లెక్కపెట్టిన యీ ఘండాలుని... ఎవరుశిక్షిస్తారు? భగవంతుడా?... భగవంతుడుంటేగా?... అమాయకులైన ప్రజలను దోచుకొనుటకు, దొంగభక్తులు చెప్పేమాటలేగాని, యేడీ భగవంతుడు? లోకాన్ని మోసగించుటకు, పాపిష్టి కవులు వ్రాసిన గ్రంథాల్లో తప్ప, యెక్కడున్నాడు, దేవుడు? ప్రపంచకంలో యింత అన్యాయం జరుగుతుంటే... ఛా! ఛా! దేముడులేడు- దయ్యములేదు- పాపపుణ్యాలు అంతకుముందే లేవు... నమ్ముకొన్నవాణ్ణి అన్యాయంచేయవచ్చు? మస్తాన్! ... మనిషివానీవు? కాదు, కాదు- రాక్షసుడవు... బారెడు

ముక్క, మూరెడువండ్లు వున్న, భీకరాకారులుగాదు రాక్షసులంటే... నీవంటివారే మస్తాన్ రాక్షసులు! నీవ్రచస్త్రే, గద్దలూ, కాసులు, గూడా ముట్టుకోవు. నీశరీరాన్ని... నీకేమి తక్కువ జేశాను? ఎప్పుడు యెంత అడిగితే అంతయిచ్చానే,? నీవు నాక్రింద నౌకరువైనా, హీనకులస్తుడవైనా, లెక్కచేయకుండా, స్నేహితుణ్ణిచూచినట్లుచూచానే?... పొసాను! నాదే తప్పు... వాకిట్లో కుక్కవలె పడియుండవలసిననిన్ను,యింట్లోకి రానిచ్చినందుకు నాకిదిశిక్ష... తాకుటకుగూడా వీలులేని నీచుణ్ణి, నిన్ను సరిసమానంగా చూచినందుకు నాకిది శిక్ష... ఇంతకూ నీతప్పేమున్నది? ఆముండ యిష్టపడితే నీవుసరేనన్నావు కాబోలు?... ఆడది సిద్ధపడితే మగవాడు కాదంటాడా?... పాపిష్ఠిముండా! ఇంతపని చేస్తావనుకోలేదు- నీకేమి పెద్ద రోగము వచ్చింది? తురకవాడి స్నేహాము చేయకపోతే, నూతిలోబడి చావకపోయినావు?... నీవెందుకు పడతావు? ఇప్పుడు నేనేపడాలి- ఇంకాయెందుకు బ్రతకడం? దేన్ని కాపుకోవాలి? జీవించి... ఆస్తిఅంతాపోయి అప్పులపాలైనాను... అపజయము గలిగింది... అందరిచేతా తిట్లుదిన్నాను...ఇంకెందుకు?... గాని, ఇవన్నీ ఒకయెత్తు... ఈవిషయం ఒకయెత్తు..

ఈ అపవాదు భరించలేను- "హనుమయ్య చెల్లెలు, మన్నన్న తగులుకొని పోయింది" అని లోకం కోడయి కూస్తుంది... ఆమాటలువిని బ్రతుకలేను...ముమ్మాటికీ...ఇస్! అబ్బ!...

(నాయుడు ప్రవేశించును.)

నాయు:— గుడ్ మార్నింగ్!

హను:— నాయుడుగారా, రండి! కూర్చోండి!

నాయు:— ఓడిపోయినామని విచారిస్తున్నారాయేం?

హను:— అబద్ధమెందుకు? నిజమంతే!... విచారంగామమరీ? మూడువేలు ఖర్చుపడిగూడా, వోడిపోతే,-

నాయు:— మూడువేలయినయిటండీ?

హను:— చెప్పుకొంటే లాభమేముందిసార్! మీకేంతెలుసు నా అవస్థ? నేను చాలా తెలివితక్కువ పనులు చేశాను.

నాయు:— యస్, యస్! మేబి,... అయితేఒకటి- జయాపజయాలు మనచేతులో లేవుగదండీ? ప్రైచేయడం మటుకే మనవంతు- ఏమంటారు?

హను:— అంతేలెండి, ఆఖరున అలాగే అనుకోవాలి.

మంచివాళ్ళెవరు?

నాయు:— ఇప్పటికైనా ఫరవాలేదులెండి! మనకింకా అప జయము రానట్టే... ఎలాగంటారా?

హను:— (వికటంగా) భలేవాడవయ్యా! "కిందబడ్డా, పై చెయ్యి మనదే"నంటావు- ఓడిపోయినా, నీకింకా బింకాలు తగ్గలేదే?

నాయు:— అదే పొరపాటు... మనము వోడిపోలేదంటూ వుంటే, వినరేం?

హను:— ఓడిపోలేదూ? ఓడిపోక?...

నాయు:— వినండిమరి! యెలక్షలో చాలాఅన్యాయంజరిగింది శర్మ చాలా అక్రమాలు చేశాడు- అతని వోట్లలో కొన్ని చెల్లగూడనివున్నాయి... ఔనంటారా? కాదం టారా? చెప్పండి!

హను:— నిజమేగాని, యిప్పుడీ మాట లెవరు వింటారు?

నాయు:— అలాగాదు. మనం సివిల్ కోర్టులో, దావావేసి, యెలక్షన్ రద్దుచేయించవచ్చు.

హను:— ఓహో! ఇదా నీయెత్తు? సరే, సరే! అయినట్టే! బాబూ! యెందుకుగాని అవన్నీ,?... జరిగిందేమో

జరిగింది- ఇక పోనివ్వండి- నాదగ్గర ఒక రాగిడబ్బు కూడా లేదు.

(సుబ్బారాయుడు ప్రవేశించును.)

సుబ్బా:— (తనలో) ఓడిపోయిన ముండలిద్దరూ ఒకచోట జేరారే? మాచచ్చినోడికంటే. నాయుడేనయ్యం- (పెద్దగా) అదిగాదురా! హామిమిగా! నీకెందుకంట యీ యేషాలన్నీ? అయ్యయ్యో! ఆస్తి అంతా పాడు జేశావుగద?... నీదుంప యిట్లా తెంచుకొంటివి... ఆముండ జూడబోతే, తొరకోడ్ని.....

హను:— (కోపంతో) నీకు బుద్ధివుందా, లేదా? ఇక్కడికి రావద్దంటే యెందుకువచ్చావు? గెట్ఔట్!.ఫూల్!

(నాయుడు చెప్పకుండా లేచి వెళ్ళును.)

సుబ్బా:— చచ్చినోడగిందరా! చచ్చినోడాఅని! ముండయి కూర్చొన్నా, నీ గుబోలేదు... చావు! నీరాత ఖైదులోబడేరాతేలే! (అని మెల్లగా వెళ్ళును. తెర వాలును)

మంచివాళ్ళెవరు?

# అయిదవ అంకము.

## 1. వ రంగము.

(శ్రీదేవి యింటి వెనుకభాగములో ఉద్యానవనము- శ్రీదేవి చక్కగా అలంకరించుకొని, అందంను, విహరిస్తూ వుంటుంది.)

వనమూ! కడుసునమూ! సుఖా
    వహమూ! శుభంకరమూ!.........ఈవనమూ!
మహిమాన్వితమై- మనోహరంబై,
    మహదానందంబును గొల్పెడి......ఈవనమూ!
ఇంపగులతలును- సొంపగు సుమములు
    యొన్నెన్నో ఫలజాతులు
లెక్కింపగ నలవిగాని లేతమావిగున్నలును...ఈవనమూ!
పక్షిసంతతులు నిర్భయంబుగా
    ప్రణయగీతికల బాడుచున్నవి
ఈవనమూ! కడుపావనమూ!

ఈ రసాలమెంత మనోహరముగావుంది? చిగుళ్ళకు యింత అందమెలావచ్చిందో?... ఔరా! సృష్టికర్త రచనా

నైపుణ్యము!... విచిత్రికారుడు వేయుగలడీవిధంగా? ఇది వసంతముగదూ? పూలతీగెల తోరణాలు గట్టింది, వసంత లక్ష్మి, మాధవుని కొరకు యెదురుజూస్తూ, ఉత్సాహంతో, పుబికిపోతున్నది? రాగరంజితమైన యీ గులాబీ పూలు ఆమె అనురాగాన్ని ప్రకటిస్తున్నయి?...స్త్రీ శరీరము దూదివలె... కాదు, కాదు- పట్టువలె మెత్తనయింది... పురుషులది యినువ శరీరము... నవనీతహృదయులుస్త్రీలు... పాషాణహృదయులు పురుషులు...... (లతలను తాకుతూ) సత్కవీశ్వరుల కావ్యంలాగున, వనలక్ష్మి నెన్నిసారులు చూచినా, యేదో, నూతనత్వం పొడకట్టుతునే వుంటుంది... ఇందుకే కాబోలు కవులు ప్రకృతిమీదబడి, మైమరుస్తారు- ఎంత బాగుంది?...

ప్రకృతి యానందరసమును బంచురీతి
పూలకావులు దిశలను ముంచుచుండె,
చిగురు పొదలల్లి, తీర్చెను చిత్రికళ-
ప్రణయగీతాల గోయిలల్ బాడుచుండె...।

వసంతములో, కావలసినంత కవితాసామగ్రివుంది... కంటికికనపడే ప్రతివస్తువుమీద ఒక కావ్యం వ్రాయవచ్చు! ...అసలు కవిత్వం, ప్రకృతిలోనుంచి పుట్టిందట... ఇదిగాక

మంచివాళ్ళెవరు?

ప్రకృతి ఆరాధించే, తెగ ఒకటివుంది. (కొంతదూరముపోయి, మల్లెపూలుకోసి) ఈమల్లెలు హృదయాల నెంతరంజింప జేస్తయి? ఎంతకమ్మనివాసన?... కమ్మనిదేగాదు- ఘాటమైనదిగూడా... ఆశ్చర్యకరమైన వశీకరణశక్తి యిందులో వుంది... స్త్రీపురుషుల కలయికకిది వుపయోగకారిగా వుంటుంది... వీటినిజూచి, అనేక పాఠాలు నేర్చుకోవచ్చు... ప్రకృతినిమించిన విద్యాలయాలులేవు... అనుదినము యిలాంటివెన్నో చూస్తుండిగూడా, మానవులెంత పెడదారిన నడుస్తుంటారు?

ఏఫలమాసించి, యీసూర్యచంద్రులు
జగతికి వెలుగీయ సంచరింతురు?
ఏభోగములనున్నై, యీమందపవనుండు
వీచుచు జగముల బోషించుచుండు?
ఏకోరికలుంగల్గి. యీనదీనదములు
పావనజలమిచ్చు ప్రాణతతికి?
ఏలాభమును బొంద, ఈవృక్షసంతతి
మధురఫలాలిచ్చు మానవులకు?

సృష్టియెల్లను పరులకై సేవజేయ
ప్రకృతియే త్యాగరూపమై పరిఢవిల్లె,

కన్నులారంగ జనులిది గాంచిగూడ;
సిగ్గ! స్వార్థము విడలేరు సిగ్గు, సిగ్గు!-

(కొంతదూరము నడచి, గులాబీ మొక్కవద్ద ఆగి,)

ఇది చాలా లేతమొక్క- ఇంకా కాపుకురాలేదు.

(ఇంతలో శ్రీరాములు ప్రవేశించి)

శ్రీరా:— (నవ్వుతూ) శ్రీదేవీ! వనవిహారం చేస్తున్నావా? ఎంత అందముగా వున్నావు. వనదేవతలాగ?

శ్రీదే:— నీవు మాధవుడవా?

శ్రీరా:— లోకంలోవున్న రసికులంతా, కొన్నాళ్ళునీకు శుశ్రూష చేస్తే బాగుంటుందేమో? సరేగాని- ఇంత చక్కగా అలంకరించుకొన్నావుగదా? ఎవరిదగ్గర నేర్చుకొన్నావు, యివన్నీ?

శ్రీదే:— ఎవరినో యెందుకు ఆశ్రయించాలి, అలంకార శాస్త్రమంతా జీర్ణంచేసుకొన్న కవిశేఖరులు నాకు పతులైయుండగా?

శ్రీరా:— నాకు లేనిపోని యాధిక్యత నిస్తున్నావు... ఇది సహజమే...

మంచివాళ్ళెవరు?

అల్లరిజేసి తన్నెంత యొల్లకున్న.
గొప్పగా రాధ చెప్పదే గోపతఃయు-
నిల్లె వనితలు చాలు ప్రేమించుచున్న
పురుషు డసమానుడనిచెప్పి పొగడుచుందు.

సరే- దా! కూర్చొందాం, కానీవు (ఇద్దరు చలువరాతి అరుగుమీద కూర్చుంటారు)

శ్రీ దే.— మనవ్యాపార మెలావుంది?

శ్రీ రా:— వ్యాపారమా? మనలను ప్రేమించే సుజనులందరికి సంతోషంగాను, ద్వేషించే అసూయాపరులకు దుఃఖంగానువుంది.

శ్రీ దే:— కారణం, లాభము వచ్చిందనేనా?

శ్రీ రా:— ఔను- బాగా వృద్ధికూవస్తున్నది- మంచిలాభం వస్తున్నది.- భగవదనుగ్రహముంటే యీ సంవత్సరం భారీగా విదేశాలతో, సంబంధముపెట్టుకొని వర్తకం చెయ్యాలని వున్నది... మోసము- అత్యాశ- మున్నగు దుర్గుణాలు లేకుండా, నీతి నియమాలకు కట్టుబడి వుంటే యేమానవుడు బాగుపడడు? ఎందుకు లాభం రాదు?

శ్రీ దే:— నిజమే- విశాల దృష్టితో, గట్టిపట్టుదలవుండీ, చేస్తే యెప్పుడు నష్టంరాదు- ఇదిగాక- దయా దాక్షిణ్యాములు గలిగి, వినయ విధేయతలతో సంచరించే, తెలివితేటలుగలవారిని అందరు ఆదరించి, గౌరవిస్తారు ... సరేగాని; "ద్వేషించే అసూయాపరులు" అని అన్నారే. మనకు ద్వేషు లెవరున్నారు? మనమెవ్వరికి కష్టం గలిగించలేముగదా?

శ్రీ రా:— పిచ్చిదానా! మనమెవ్వరికి అపకారం జేయక పోయినా, లోకంలో ద్వేషించేవాళ్లు కొందరుంటారు. ఇం తెందుకు? దేవుణ్ణికూడా తిట్టేవాళ్ళు కొందరున్నారు. దుష్టులకు మంచిచెడ్డలతో పనిలేదు. తెలుసునా? హనుమయ్యకు మనమేమి అపకారంజేశాము. అతడు నిన్నెందుకు కష్టపెట్టాలి?

శ్రీ దే.— ఔను- అతనిని మనుష్యుడనుటకు వీలులేదు. మానవులు అంతటి అక్రమాలు చేయరనుకొంటాను- పాపాత్ముడు అనవసరంగా నన్ను అనేకసార్లు బాధించాడు.

మంచివాళ్ళెవరు?

శ్రీరా:— అతడు నిన్ను పరీక్షించాడని నాయూహ- వేశ్యలకు నీతివుండదని అతని వాదన్న- అతని పరీక్షలోనీవు జయించావు- ఇది సంతోషింపదగిన విషయమే...

శ్రీదే:— ఏమో! యెట్లు చెప్పగలము? మానవుల బుద్ధి యెప్పుడేవిధంగా మారుతుందో చెప్పలేము. అంతుకనే చచ్చిన తర్వాతగాని గుణాగుణములు నిర్ణయించలేము.

శ్రీరా:— అవసరములేదు- అన్నమంతా పట్టిచూస్తారా?

శ్రీదే:— గాని, పరీక్షించుటకు, పరుల హింసించుట పాపము గదూ!

శ్రీరా:— నిష్కల్మష హృదయంతో యెవరు పరీక్షిస్తున్నారు? హనుమయ్యకు కొంతస్వార్థమున్నది.

శ్రీదే:— తగిన ఫలిత మనుభవించకపోతాడా?

శ్రీరా:— అనుభవిస్తున్నాడు- ఇదినీకు తెలియదూ? ఆస్తి అంతా పోగొట్టుకొని అప్పులపాలైనాడు- అతడి చెల్లెలు మస్తాన్ వెంట లేచిపోయింది.

శ్రీదే:— (సంతోషంతో) వెరీగుడ్! భగవంతుడు మంచి పాఠం నేర్పాడు. ఎందరో కులకాంతలు మహానీచంగా

ప్రవర్తిస్తుంటే, వాళ్ళనుజూచి యీమూఢులు సిగ్గు పడకపోగా, వేశ్యలను హేళనజేస్తారు...

కులముత్రోనేమి? గుణముగైకొనగవలదె?
లేరె పలకాంతలందున జారిమతులు?
వేశ్యలందు సుశీలలు వెలయరొక్కొ?
బుద్ధిగలవారి కియ్యది బోధపడదె!

ఇప్పటికైనా వేశ్యలలో పతివ్రతలున్నారని అతడు వప్పుకుంటాడా?

శ్రీరా:— అతడు సమ్మతింపకున్న లోకానికి నష్టమా...నేను మెచ్చుకున్నానుగదా? (చెక్కిలిగొట్టి) ఏదీ! ఒక్కటి.

శ్రీదే:— అబ్బ! ఏమిటీ మోటుసరసము!

శ్రీరా:— లేదులే!- ఇదుగో యిలారా! ఈపొదరిండ్లుచూడు.

(శ్రీదేవిని చెయ్యిపట్టుకొని తీసుకొనిపోవును.)



మంచివాళ్ళెవరు?

## 2. వ రంగము.

(శ్రీదేవి- కనకవల్లి- శ్రీరాములు- ముగ్గురు ఉయ్యాలబల్ల మీాద కూర్చొని వూగుతుంటారు- శ్రీరాములు యిద్దరిమధ్య వుంటాడు-)

కన:— ఆదిలో కొంత సందేహించాను,గాని, క్రమక్రమంగా మంచి నమ్మకమేర్పడ్డది నీచరిత్ర విన్నవాళ్ళు, వేశ్యలలోగూడా బుద్ధిమంతులున్నారని తెప్పకుండా వొప్పుకుంటారు. ఇంతకుపూర్వము యిది అసంభవమని, పిచ్చి పిచ్చి వుదాహరణాలుచూపుచూ, నాటకాలు ప్రబంధాలు వ్రాసిన మహాకవులందరు తలలు వంచుకోవలసిందే!

శ్రీరా:— కనకం! అలా అనడం తప్పు! దేశకాల పరిస్థితుల ననుసరించి, వాళ్ళు కావ్యాలు నిర్మించారు. ఆకాలంలో సందర్భాలు అలావుండేవిగాబోలు! కాలంతో పాటు బుద్ధులుకూడా మారుతుంటయి.

కన:— (వికటంగా) ఓహో! తాముగూడా కవులేగా!

మరిచి, అన్నాను. క్షమించండి!... కవులనంటే, మీకెంత రోషమండీ?

శ్రీ వే:— అయినా, ఒకరినెందుకు అనాలి? ఎవరికితోచింది వాళ్లు వ్రాస్తారు?

కన:— అదేమిటి? ఎవరికి తోచింది వాళ్లు, వ్రాయుటకు యెంత స్వతంత్రమున్నదో, వాటిని విమర్శించుటకు లోకానికీ అంత హక్కు వున్నది. బూతులువ్రాస్తే ప్రజలు సహించరు, అలాంటికవిత్వ మెందుకు?

> దేశ. మత, గౌరవంబు, సుస్థిరతనిల్ప,
> ప్రజలు – భాషయు – కళలును – బాగుపడగ
> కవిత జెప్పంగ నేర్చిన కవులు, కవులు,
> గానిచో, లోకలేనట్టి కపులుగారె?

ఈనాటి కవులలో కొందరి రచనలు తలపగులగొట్టు కొన్నను అర్థంగావు- వ్రాసిన కవులకైనా వాటి అర్థము తెలిసి వుంటుందో, లేదో? ఇలాంటి అసహ్యకర మైన, అర్థంగాని పద్యాలు వ్రాసేబదులు, కవిత్వము మనకురాదని ఒక్క నమస్కారంబెట్టి వూరుకో రాదూ?......

మంచివాళ్ళెవరు?

శ్రీరా:— (ఆలకిస్తూ) ఉండండి! వీధిలో ఏమిటాగోల?... చూచివస్తాను.

(అని తటాలునలేచివెళ్లి, కొంతసేపటికి, హనుమయ్య, శర్మ అమీనాలతో ప్రవేశించును- శ్రీదేవి కనకవల్లి లేచి నిలువబడుదురు- శ్రీరాములు లోనికేగి రు 500-0-0 లు తెచ్చి, అమీనాకిచ్చి, రశీదుతీసుకొని అందరి నిసాగనంపును హనుమయ్యమాత్రము నిలువబడియుండును.)

శ్రీరా:— (హనుమయ్యనుచూచి) నిన్నుచూస్తే, నాకు జాలి వేస్తున్నది. నీవు యీ స్థితికివచ్చుటకు కారణము స్వయంకృతాపరాధమే!... జరిగినదానికి చింతించితే లాభములేదు. ఇప్పటికైనా పశ్చాత్తాపమును బొంది, బుద్ధికలిగి వుంటావా?

హను:— శ్రీరాములూ! ఈవిధంగా నీయెదుట నిలిచిమాట్లాడుటకు సిగ్గుపడుతున్నాను... నన్ను బాధపెట్టక పోనియ్యి!...

(అని తలవంచుకొంటాడు- కంట నీరుగారును)

శ్రీదే:— (నవ్వుతూ) నన్ను పరీక్షించుటకు మరేమైనా, కొత్త వుపాయం ఆలోచించారా? హనుమయ్యగారూ! అన్నట్టు- అడుగమరిచాను- అదేమిటి, చిన్నమ్మ మస్తాన్‌తో లేచిపోయిందిట?... వేశ్యలకంటె హీనమైన పనిజేసిందేమండీ? తమయింట్లో స్త్రీలవిషయం యిలా వుంటే, సర్దుకోలేక, పరకాంతల కాసించి, చీవాట్లు తింటారేమండీ?...... అయ్యో! పాపము! తమకిప్పటికైనా, వేశ్యలలో మంచివాళ్లున్నారని తెలిసిందనుకొంటాను- ఆనాడు నాకు వేలుయిస్తామని ఆశపెట్టారుగదూ? ఇప్పుడేవీ, ఆవేలు? మీచెల్లెలుకు మస్తానెన్నివేలిచ్చాడు?...

శ్రీరా:— దేవీ! ఇప్పుడెందుకీ దెప్పుళ్లన్నీ? ఊరుకో! అదనీ యోగ్యతకు లోపము... (హనుమయ్యనుచూచి) హనుమయ్యా! నీకుకావలసిన సహాయము చేస్తాను- బుద్ధిగలిగి వ్యాపారము జేసుకొంటావా?

హను:— మిమ్ములనుచూస్తే, నాకు యేమనిపిస్తున్నది నేను మహాపచారము చేశాను- తగినశిక్ష వున్నదో, లేదో? ఇప్పుడు నేనేమి మాట్లాడలేను క్షమించు... నన్ను

మంచివాళ్ళెవరు?

ఆదరించి రక్షించు! పుణ్యముంటుంది.

(అని తలవంచి కన్నీరుగార్చును.)

శ్రీరా:— ఏడిస్తే లాభంలేదు. నేను నీకుతప్పక సహాయము జేస్తాను (అని బుజ్జగించును.)

హను:— నేను మళ్లీ మీదర్శనానికి వస్తాను ఇప్పటికి నాకు సెలవు...

శ్రీరా: సరే! వెళ్లు!

(హనుమయ్య వెళ్లిపోవును)

శ్రీదే:— (వికటంగా నవ్వుతూ) హైందవుల యీనాటి దుస్థితికి కారణం, మీవంటి పిచ్చివాళ్లే!

పడగ విసరెడు-
పాడు పాముకు-
పాలుబోయుట
మేలగునా? ఇక-
చాలులే! వేదాంతాలు!

*  *  *  *

ఆంధ్రుల కీర్తి-
యైనదెందుకో,

అర్థము జేసుకో, యినుమంతా!
పేరుగన్న మన రాజచంద్రులెం
గారడవుల బడిరెందుకో,
అరయలేవా! సుంతా!

శ్రీరా:— పిచ్చిదానా! ఇది ఆర్యధర్మము- రాజ్యములుపో యిన పోవుగాక! ఇప్పటికిని మన మతము పోలేదు. సుమా! హిందూమత సిద్ధాంతములకు వ్యతిరేకముగా ప్రవర్తిస్తే మతము శూన్యమవుతుంది, అప్పుడు హిందువులనువారుండరు. మతమును, సంఘమును ధిక్కరించి, తాత్కాలిక సుఖము లనుభవించుట తెలివిగల పనిగాదు- మతధర్మములను పరిపాలిస్తూ, న్యాయసమ్మతముగ జీవించుటే, హిందువుల ఆశయము- అర్థమైనదా? పాపభీతి- జాలి- లేనివాడు మానవుడనిపించుకోనడు- ఆత్మశక్తివలన దివ్యతేజమును సంపాదించి, దేవదానవుల కందని సచ్చితానంద స్వరూపమును పొందుటకు హిందువులే సమర్థులు...

శ్రీదే:— అయ్యా! ఆపండి మీవుపన్యాసం! ఈ వెఱ్ఱివేదాంతాలు చాలావిన్నాను- "స చ్చి తా నం ద మ ని"

యేమో, పెద్ద పెద్ద మాటలన్నీ చెపుతున్నారు గాని, యెవరికి గావాలి యీ వేదాంతాలు? మన డబ్బుతో మనకళ్లయెదుట సాటివాళ్లంతా, అనుభవిస్తూ హాయిగా సుఖపడుతుండగా, "ఆర్యధర్మము" అని అష్టకష్టాలుపడుతూ, చావుబ్రతుకులమధ్య నలిగిపోతూ వుండుటకు యేమూఢుడు సమ్మతించును- ముందెప్పుడో పెద్ద కొండ మన నెత్తిన పడుతుందని, యిప్పటికే పూడిచావమంటే, యెవరు వింటారు- మీ శాస్త్రిలు గిస్త్రిలు, కట్టిపెట్టండి; మన రాజ్యాలు యిలాగే కోలుపోయినాము... చక్రవర్తి పృథ్వీరాజుమీదికి మహమ్మదుగోరీ దండెత్తివస్తే, చక్రవర్తి గోరీకి బుద్ధిచెప్పి, బుజ్జగించి "నాయనా! ఇలా యెప్పుడు రాకోయ్!" అని పంపించాడు. కొన్నాళ్లకు మరికొంతసేనను పోగుచేసుకొని గోరీ మళ్లీవస్తే, చక్రవర్తిగారు అప్పుడుగూడా యిలాగేసెలవిచ్చారు- ఈవిధంగ యేడుసార్లు, పృథ్వీరాజు చేత గోరీ కరుణింపబడి, ఆఖరుకు అధికసైన్యంతో వచ్చి పృథ్వీరాజు తల పడగొట్టి, రాజ్యం కాజేశాడు... తెలిసిందా?...

శ్రీరా:— శ్రీదేవీ! నీ తెలివి తేటలు విపరీతంగా నడుస్తున్నాయి- పసిదానవు- నీకనుభవం తక్కువ.

కన:— శ్రీదేవీ! నీవు నిజంగా పొరబడుతున్నావు- శాంతంలో వుండే సౌఖ్యమూ- త్యాగంలోవుండే ఆనందము- ప్రేమలోవుండే మాధుర్యము నీకింకా బోధపడలేదు- దీర్ఘంగా ఆలోచించుకో!...

(తెరలో "శ్రీరాములుగారూ!" అని కేక)

శ్రీరా:— గుమస్తా వచ్చినట్లున్నాడు- నేను మాట్లాడివస్తాను. మీరు లోనికేగండి!

(తెర వాలును.)



మంచివాళ్ళెవరు?

# అయిదవ అంకము.

## 3. వ రంగము.

---

(సత్రము అరుగుమీద మాసినగుడ్డలతో మస్తాన్ చిన్నమ్మ కూర్చొనియుందురు)

చిన్న:— ఏం మస్తాన్! మాట్లాడవేం? ఇప్పుడేదిదారి?

మస్తాన్:— క్యాదారి? మాకీయేం తెల్సు?

చిన్న:— మరి నన్నెందుకు తీసుకొని వచ్చావు? నాసొమ్ము అంతా యెందుకు ఖర్చుపెట్టావు?

మస్తా:— అరే! డోకలీకె! మాకీ అనుగుతావ్!... మీకీ రమ్మనేతో మాకీ వచ్చాం! మీకీ మాకీ జల్సా అయింది...

చిన్న:— ఔను! నేను తీసుకొనివచ్చాను, పోనీ... మరి, నీవు నన్ను పోషిస్తానని, యేమేమో చేయించి వుద్ధరిస్తానని చెప్పి, నమ్మించలేదూ? నాదగ్గరవున్న నగలన్నీ అమ్మి, యీమూడు నెలలనుంచి, పెళ్లికొడుకులాగ తిని తిరగలేదూ- సంపాదించి నన్ను పోషించలేని

వాడవు, నాసొమ్మంతా, యెందుకు అమ్మించావో చెప్పు! ఇప్పుడు నన్ను అన్యాయము జేస్తానంటావా?... నీమూలకంగా నేను సర్వనాశనమైనాను- ఇప్పుడు నీవు నన్ను సరిగా చూడకపోతే ఆత్మహత్య చేసుకోవలసి వస్తుంది తెలిసిందా?

మస్తా:— అరే అరే! నకో- నకో, మీకీ సచ్చిపొయ్యాతో మాకి పాణంవాడ్ నిలుస్తాడ్?

చిన్న:— (నవ్వుతూ) అబ్బ! ఏమి చవతీగల్లిపేమ! అందు కనే నన్ను పోషించుటకు కూలిపని చెయ్యి!

మస్తాన్:— (కోపముతో, మీసము తిప్పుతూ) - కూలీపనీ? మాకీ కూలిపని చేయవాలా? భంచేత్! కబడ్దార్!

చిన్న:— కూలిపని గాకపోతే, రాజ్యాలు యేలుతావా? నీమొహం జూస్తే, కూలీపనిగూడా యెవ్వరు యివ్వరు... మీసందిప్పి కల్లెర్రజేస్తే, భయమా? ఎవరి మీద నీకోపం? చచ్చినట్టు పడివుండక...

మస్తాన్:— భంచేత్! మాంకేతో మొఖం గిఖం తిరిగిపోవాల (అని కొట్టబోవును)

మంచివాళ్ళెవరు?

చిన్న:— కొట్టు? నీచేతిలోనే చచ్చిపోతాను. ఇంకా బ్రతికి లోకాన్ని యేమని చూచేది? ఫకీరు ముండాకొడుకును నమ్ముకొంటే...

మస్తాన్:— క్యాబోల్తే? ఛంచేత్ (అని చేతితో ముఖము మీద రెండు దెబ్బలు కొట్టును- చిన్నమ్మ యేడుస్తూ క్రింద కూలబడును- మస్తాన్ కాలితో మరియొక తన్ను తన్ని వెళ్లిపోవును.)

చిన్న:— (ఏడుస్తూలేచి) దుర్మార్గుడా! ఎంతమోసం జేశావురా! నిన్నంటే లాభమేముంది? "కులం చెరిచేవాళ్లే గాని, కూడు పెట్టేవాళ్లు లేరని" పెద్దలు వూరికే అన్నారు. ఉత్తమస్త్రీలమార్గంలో వుండి, మర్యాదగా జీవించక, పశువుదనపు తిమ్మిరితో, తక్కువకులపు నీచులతో స్నేహంజేస్తే, వూరికే పోతుందీ? తల్లి దండ్రిలను కష్టపెట్టి అన్నదమ్ములను అవమానపరచి, చుట్టాలకు గౌరవము పోగొట్టి, వ్యభిచారవృత్తికి దిగిన వారికి, యీ ప్రాయశ్చిత్తము కావలసినదే!...... నావలె యెందరు కులస్త్రీలు పాడైనారో? మహా తల్లులు అనసూయ మున్నగు స్త్రీరత్నాలు పుట్టిన

యీ భూమిమీద, యిప్పుడు నావంటి కులటలు వున్నారు... స్త్రీలకు పాతివ్రత్యం లేకపోతే, యీరాజ్యాలు నిలుస్తాయా? ధర్మాలు వుంటాయా? దేశం సుఖపడుతుందా? మతము- సంఘము- సంసారము- అన్నీ అధోగతిపాలు గావలసిందే!... నావంటి జారిణులు యీ దేశంలో జీవించి వుండకూడదు- సిగ్గు! సిగ్గు! నావంటి కులస్త్రీలు- ఛీ! ఛీ!- వేశ్యలు వృత్తి మాని, వివాహాలు జేసుకొని, గౌరవంగా బ్రతుకుతుంటే, కులస్త్రీలు వేశ్యలకంటే నీచంగా సంచరిస్తున్నారు... నావంటివారికి యేశిక్ష తగిందో?... నన్ను చూచియైనా, కులస్త్రీలు బాగుపడుదురుగాక! వ్యభిచారవృత్తి యీదేశంలో రూపుమాసి పోవుగాక! (అనుచూ మెల్లగా కొంతదూరము నడిచి) ఇదేమిటి? ఆలోచనలేకుండా పోతున్నానేం? ఎక్కడికి పొయ్యేది? ఎవరు నన్నాదరిస్తారు? (ఆలోచించి) సరే! కానీ! ఇంకా పనువేమిటి? మావాళ్ల యిళ్లల్లో యెక్కడైనా, వంట మనిషిగా వుండి చాకిరీ చేసుకొని బతుకుతాను... అబ్బ! ఈ ఆకలిబాధ భరించలేను... (ఆలోచించి)

మంచివాళ్ళెవరు?

ఇంతకంటే చెప్పేదేమున్నది? ఈపూటకు రహస్యంగా బిచ్చమెత్తుకొని యెలాగో కాలంగడుపుతాను.

(అనిపోవును)

# అయిదవ అంకము.

## 4. వ రంగము.

(శ్రీదేవి శ్రీరాములు, విలువగల దుస్తులతో వుయ్యాలబల్ల మీద కూర్చొనివుంటారు- సోఫాలో సుశీలవుంటుంది)

శ్రీదే.— సుశీ! ఇవ్వాళ నీవువస్తావని అనుకోలేదుసుమా! ముందుగా ఒక జాబుగూడా వ్రాయకపోతివి. ఎన్నాళ్ళోఅయింది నిన్నుచూచి- చాలా మారిపొయ్యావు...

శ్రీరా:— ఎదిగే వాళ్లల్లో మార్పు యెక్కువుంటుంది- అందులో ఆడవాళ్లకు మరీనీ.......

శ్రీదే:— సుశీ చాలా అదృష్టవంతురాలండీ! చక్కగా మొగుడు సాల్టుసబ్-యినస్పెక్టరు అయినాడు.

సుశీ:— నా అదృష్టమే మెచ్చుకో!... నీతో కంపేరుజేస్తే, అయామ్ నథింగ్!

శ్రీదే:— అనాలని అంటున్నావుగాని, సుశీ! నాకేమున్నది చెప్పు?

సుశీ:— ఇంకేమిగావలె? రత్నంవంటి శ్రీరాములును యీాజీగా భక్తపరచుకొని, ఓన్ ప్రాపర్టీలాగ వాడుకొంటున్నావు- వ్యాపారంలో కావలసినంత లాభంవస్తున్నది. కొత్తమేడగూడా కట్టిస్తున్నావు...

శ్రీదే:— ఈమాటలకేమిగాని,... మనతో చదువుకొన్నవాళ్లందరు మంచి స్థితిలోనే వున్నారు.

సుశీ:— ఎక్కడికీ బాగు? ఇంకాముందు యెంతకాలమో జరుగవలసివుంది... సరేగాని, శ్రీదేవీ! నీవు చాలా చిక్కిపోయినావేం?

శ్రీరా:— హనుమయ్యతో ఫైట్ చేయడంవల్ల చిక్కిపోయింది.

సుశీ:— హనుమయ్య అంత దుర్మార్గానికి దిగుతాడని యెప్పుడూ అనుకోలేదు. అతని చర్యలు విన్నప్పుడు

మంచివాళ్ళెవరు?

కోపం వస్తుంది, గాని, అతని ప్రవర్తనను తలంచినను చూస్తే జాలివేస్తున్నది.

శ్రీరా:— ఔనౌను! అది మానవ సహజం!

(గుమ్మంవద్ద యెవరో అరుస్తూవుంటారు- శ్రీరాములు వెళ్లి, బిచ్చకత్తెగానున్న చిన్నమ్మతో ప్రవేశించును)

శ్రీరా:— ఇదుగో! మరియొక చిత్రము! హనుమయ్య చెల్లెలు యీమె- ఇప్పుడు బిచ్చగత్తెయై వీధులవెంట తిరుగుచున్నది.

శ్రీదే:— ఆఁ! (తేరిపారజూచి) నీవు హనుమయ్య చెల్లెలువా? తురకవానిని తగులుకొని పోయిన మహా పతివ్రతవుగాబోలు?

శ్రీరా:— శ్రీదేవీ! చచ్చినపామును, మళ్లీ చంపుటెందుకు?

చిన్న:— (తల వంచుకొని) అమ్మా! నన్ను మారింత యేడిపించవద్దు- కదిలిస్తే నాహృదయం పగిలిపోతుంది- మీకిష్టమైతే రెండుమెతుకులు వేసి పంపండి! లేకపోతే...

శ్రీదే:— అలాగే, నీవు చక్కని భోజనం పెడతానుగాని,...

ఒక ప్రశ్నకు సమాధానము చెప్పు!... నీవంటి కులస్త్రీ మంచిదా? నావంటి వేశ్యమంచిదా?

చిన్న:— సందేహమేమున్నది? ముమ్మాటికి నీవే మంచిదానవు- వేశ్యలలోగూడా, పతివ్రతలున్నారు.

శ్రీదే:— వెరీగుడ్!

సుశీ:— శ్రీదేవీ! నీవెంత అల్పసంతోషివి?

శ్రీదే:— పాపం! ఈమెకు భోజనము పెట్టివస్తాను మీరు మాట్లాడుచుండండి!

శ్రీరా:— నేను యిప్పుడే బజారువెళ్లివస్తాను.

(తెర వాలును.)



మంచివాళ్ళెవరు?

# అయిదవ అంకము.

## 5. వ రంగము.

---

(మాసినగుడ్డలతో హనుమయ్య పాడుకొంటూ పిచ్చి వానివలె వస్తుంటాడు.)

వెలకొంతలను మీరు
చులకనగా చూడకండి!
కులకాంతలందూన
వెలిశారు సమత్రూలు!
పలుకనేల పలుమాటలు
తలచండీ! మేలిగుణము!... ॥ వెలకొంత॥

(శ్రీరాములు యెదురుపడి) హనుమయ్యా! ఏమిటి సంగీతాలు తీస్తున్నావు?

హను:— శ్రీరాములూ! నువ్వా! క్షమించు! దుర్మార్గుణ్ణి! నన్ను పోనియ్యి! శ్రీదేవి మంచిదని. పాటలు పాడు కొంటూ తిరుగుతాను.

శ్రీరా:— ఎప్పుడూ స్త్రీలగోలేనా? ఆడవాళ్లల్లో మంచివాళ్లె

వరో గ్రహించావుగాని, మగవాళ్లసంగతి తెలుసు కొన్నావా?

హను:— ఆహా! చక్కగా తెలుసుకొన్నాను. "అగ్రహారం పోతేపోయిందిగాని, అక్షరమంతా తెలిసింది" అన్నాట్ట ఒకడు- అలాగే, నేను యీస్థితికి వచ్చేవరకు యెన్ని నేర్చుకొన్నాననుకొన్నావు.—

నీతి నియామాలింకా
నిలిచినవి బీదలందూ,
భాగ్యవంతులెన్నెన్నో
పాడుపనులు జేస్తారు...

*           *           *           *

దయగలవానికి మనము
దండాలు పెట్టొచ్చూ,
అతడే దేవుడూ!
అతడే పూజ్యుడూ!

శ్రీరా:— వెరీగుడ్!... అయితే మరి సొమ్మిస్తాను, వ్యాపార జేసుకొంటావా?

హను:— వొద్దుబాబూ! వొద్దు నన్ను పోనియ్యి! నేను కొన్నాళ్లు దేశంతిరిగిరావాలి...

మంచివాళ్ళెవరు?

శ్రీరా:— యిప్పుడెక్కడికి పోతావు?

హను:— ఎక్కడికో? ఇలాపడి పోతాను కాశీదాక......

(అని వెళ్ళిపోవును.)

శ్రీరా:— ఆహా! శాంతించునుగాక! దేశము శాంతించుగాక!

దేశమున పాడిపంటలు తేజరిలుత!<br>
నీతి నియమాలు- ధర్మాలు నిలుచుగాక'<br>
అన్న దమ్ముల పోట్లాటలణగుగాక!<br>
కవుల పోషించు రాజులు గలుగుగాక!





# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA115B120 |
| పుస్తకం పేరు | మంచివాళ్లెవరు |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 117 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | munisha |
| పేజీలు విడదీసినది | thasin |
| స్కాన్ చేసినది | thasin |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |